# శ్రీమదాంధ్రవివేకచూడామణి





గ్రంథకర్త

మొటపర్తి చినసోమయ్య చౌదరి

శ్రీరస్తు.

# శ్రీమదాంధ్ర వివేకచూడామణి.



గ్రంథకర్త:

మొటపర్తి చినసోమయ్యా చౌదరి.

1933.



[వెల రు 1—0—0

# ఆశీస్సు.



చ. వివిధవిధంబులన్ జగము
భిన్నమునొందుచు నున్న సర్వదా
భువి నొకరూపమై చెలఁగి
బుద్ధిని వాక్కున నంద బోక నే
యవధియులేక సర్వజగ
దాకృతి శాశ్వతమై వెలుంగు స
త్ప్రవిమలదివ్యధామము ప్ర
పంచమునెల్లపు డోముఁ బ్రేముడిన్.



# ప్రార్థన.

ఉ. ప్రేమరసస్వరూపిణి ద్వి
రేఫఘనద్యుతి నీలవేణి సు
త్రామముఖామరార్చిత ప
దద్వయి సద్ఘృణి బ్రహ్మరాణి భా
షామహితాభిధాయిని ప్ర
సన్నత శంకర సద్వివేక చూ
డామణి నాంధ్రకావ్యముగ
డంబుమెయిన్ రచియింపజేసి ప్ర
జ్ఞామహితుంబొనర్చితివి
శారద! నీకృప నెన్నశక్యమే!

ఉ. దోషము, సుప్రసన్నము, బు
ధుల్ గని సంతసమందునంత కే
వ్రాసిన గ్రంథరాజమును
బాత్రమటంచెద నెంచబోను తాఁ
జేసిన సాలభంజికల
శిల్పముగాంచి సభాజనమ్ము సం
తోసమునందు నంతకు ఘ
నంబగు శిల్పిముదమ్ము గాంచునే.

# కవిసుధీధర్మములు.

చ. కవి రచియించుఁ గేవలము
కావ్యము; నాతని ధర్మ మద్ది; స
త్కవికృతకావ్యసద్యశముఁ
గాష్ఠలనింప సుధీసుధర్మమౌ;
భువనము నెమ్మిఁ బద్మమును
బోషణ సేయును; తత్ప్రయోజనముం
రవి తన వేకరంబులఁ గ
రంబు రహింపగఁ జేయు లక్ష్మితోన్.

V 101

# పీఠిక.

శ్రీమద్గోవింద భగవత్పాదాచార్య ప్రధానశిష్యుండై శ్రీజగద్గురువు, అపరశంకరుండను మున్నగు మహాబిరుదములను వహించి, అనర్గళప్రతిభావిశేషమున నాసేతు హిమాచల పర్యంత మెక్కుమ్మడిం దనజ్ఞానచంద్రికలను బ్రసరింపంజేసి విద్యా వైశద్యమున విమతతాంత్రిక ద్వైత మతాది సకల దుర్మతఖండనమున దిగ్విజయ మొంది పద్మపాద, హస్తామలక, కళానాథ, మండనమిశ్ర, సురేశ్వరాచార్యాది పండిత శిష్య బృందములతోంగూడి శంకర భగవత్పాదాచార్య నామంబున విరాజిల్లిన శ్రీశంకరాచార్యుని చరిత్ర మత్యద్భుతము.

ఇమ్మహానుభావుండు విక్రమశకము 14 సరియగు నీశ్వర వర్షంబున వైశాఖశుద్ధ పంచమినా డవతరించినట్లార్య విద్యాసుధాకరమునం గన్పట్టెడిని. పాశ్చాత్య విపశ్చిద్వరుం డగు మాక్సుముల్లరు హూణశకము 788 సంవత్సరము మొదలు 820 సంవత్సరము దనుక నుండినట్లు తెల్పియుండె; మఱికొందఱు రెండువేల సంవత్సరములకుం బూర్వపువాం డనియు, నింకను గొందఱు పదునొకండువందల పదునేను వర్షములకు ముందువాండనియు నుడివియుండిరి. దీనినిర్ణ యమును జారిత్రకులపై విడిచి యీమహాత్ముని మహత్వముల దిజ్మాత్రముగం దెలుపుచుంటిని.

జనకుండగు శివగురు సోమయాజి సర్వవిద్యాధీశ్వరుం డగు తన కుమారునకుం బరిణయ మొనరింప యత్న

మొనరించుచోటి శంకరుఁడు నాతత్త్వమెఱుంగకయుఁ దనకు మరణ మాసన్నమయినదనియు నాతండ్రి యెఱుంగఁడయ్యె నని విచారించెను. చూర్ణీనదికిం జనియందుస్నానమొనరించు చుండ మొసలియొకఁడు పాదంబులంబట్టి విడువకున్న సమయమునఁ దల్లియగు నార్యాదేవింబిల్చి "అమ్మా! నన్నీమొసలి విడువక చంపనున్నది. నేను మృతుండనైన మజ్జన్మమువ్యర్థము. కావున సన్న్యాసాశ్రమంబు స్వీకరింప నాజ్ఞ" యిడుమని వేడి తత్క్షణము తల్లియనుమతిని మానస సన్న్యాసము స్వీకరింప నమ్మకరము విడిచి గంధర్వాకృతిం దాల్చెను. తాను సన్న్యాసియై గోవింద భగవత్పాదాచార్య గురుదత్త చంద్రమౌళీశ్వరలింగముం గైకొని దేశపర్యటన మునకుం బోవుతఱిఁ దల్లింగని నీవెప్పుడుతలంచిన నప్పుడేను నీకగపడుదునని చెప్పి చని, యొకానొకదినంబునఁ దల్లిస్మరింప సర్వజ్ఞుఁడగు శంకరదేశికుఁ డార్యాదేవికి మరణము సమీ పించుటెఱింగి తల్లిమ్రోలకువచ్చి యమ్మహాదేవి స్నానా ర్థము చూర్ణీనదికిం బోఁజాలనన నా నదని తనమహిమచే గృహసమీపమునకు రప్పించెను. దివాకర పుత్రుండగు బ్రాహ్మణబాలకుండు మూఁగవాఁడై తనయొద్దకురా, "నీ వెవ్వండ వెందుకిటవచ్చితివి? నీపేరే"మని బహువిధంబులఁ బ్రశ్నింప నబ్బాలుండు శ్రీజగద్గురుదర్శనప్రభావమున "ఆత్మ స్వరూప తత్త్వంబేనగుదు" నని నుడువ సంతసించి యతనికి సన్న్యాసమొసంగి శిష్యుంగాఁ జేకొని ఆత్మస్వరూపంబును హస్తామలకముగ తెలుపుటం జేసి యాతనికి "హస్తామలకుం"

డనునామంబిడె. ఇట్లే బహురీతులఁ దనమహత్వము కలిమి, శిష్యప్రకాండము నుద్ధరించెను. పదంపడి పండితులు కాశీ క్షేత్రమున ద్వైతాద్వైత సత్యత్వనిరూపణమునఁ దర్కిం చుచు ద్వైతమును మిన్నగఁబొగడుచు శంకరు నిందింప నాజగద్గురువు విశ్వేశ్వరప్రార్థన మొనరింపఁ దత్‌క్షణము మహాదేవుండు ప్రత్యక్షమై వేరెలుంగునఁజేయెత్తి "ఓభక్తులారా! ద్వైతాద్వైతంబుల నద్వైతంబె యుత్కృష్ట మతంబని వక్కాణింప నాఁటనుండి యంజలి వారమ్మతమునే యవలంబించిరి.

సర్వకళాపరిపూర్ణుండగుజగద్గురూత్తముఁడుఅద్వైతార్థ ప్రతిపాదకములగువ్యాససూత్రములకును,దశోపనిషత్తులకును, భగవద్గీతకును, శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రమునకును, రుద్రా ధ్యయనమునకును భాష్యములనురచించి యయ్యవి సామాన్య బుధదురవగాహము లగుటంజేసి సర్వజనోపయోగముగ వివేకచూడామణి, ఆత్మబోధము, ఆత్మానాత్మ వివేకము, అపరోక్షానుభూతి, ఉపదేశసాహస్రియునగు నద్వైతప్రకరణ గ్రంథములను, భక్తిరసప్రధానంబులగు ద్వాదశిమంజరికా స్తోత్రము, సౌందర్యలహరి, శివానందలహరి, దక్షిణామూర్తి స్తోత్రము మున్నగు స్తోత్రరత్నములను రచించి దేశోపకార మొనరించెను.

పయిగ్రంథములు చాలవఱకు బహుపండితులు వివిధ రీతుల నాంధ్రీకరించి తద్రహస్యార్థములను లోకమునకు

వెల్లడించిరి. ఇంతవఱకు ఈ వివేకచూడామణి మాత్ర మాంధ్రీకరింపఁబడి యుండదనియే నానమ్మకము. దీనిని, ఆంధ్రమేఘదూత, ఆంధ్ర ప్రశ్నోత్తర రత్నమాల, సంస్కృత భాషాప్రబోధము మున్నగు గ్రంథములను రచించిన మ.రా.శ్రీ మొట్టపర్తిచినసోమయ్యచౌదరిగారాంధ్రీకరించిరి. ప్రథమ ప్రయత్నముననే వీరింతలాలిత్యముగ మూలగ్రంథ భావానుసారముగఁ జక్కఁగ నాంధ్రీకరించుట మిగులఁగొని యాడఁదగినది. స్థాలీపులాకన్యాయముగ నిందలి నాలుగైదు మూలశ్లోకములను, ఆంధ్రీకరణపద్యములను దార్కాణముగఁ జూపి యేతద్గ్రంథోత్కృష్టతను పాఠకబృందమునకుఁ వీడు చుంటిని.

మూలము సం॥ 146 శ్లోకము.

బీజం సంసృతిభూమిజస్యతు తమో దేహాత్మధీరంకురః
రాగః పల్లవమంబుకర్మతు వపుస్కంధోఽసవశ్శాఖికాః
అగ్రాణీంద్రియసంహతిశ్చవిషయాః పుష్పాణిదుఃఖం ఫలం
నానాకర్మసముద్భవం బహువిధం భోక్తాత్మజీవః ఖగః.

ఆంధ్రము 147 సీసము.

సంసారమను మహాశాఖి కజ్ఞానమ్మ
విత్తనమ్మగుచును వెలయుఁ దనువు
నాత్మఁగాఁదలఁచుట యంకురంబగుఁగోర్కి
చిగురుకర్మచయమ్ము క్షీరమలరు

సంగమ్ము స్కంధమ్ము నసువులెల్లనుగొమ్మ
లింద్రియమ్ములుకొన లిలగుణములు
పూవులుబహుకర్మ పుంజసంభవమగు
దుఃఖముఫలమయి దోఁచుచుండు

తే. గీ. నిమ్మహీరుహమందున నింపుమీఱ
ఖేచరముభాతిజీవుఁడు క్రీడలొంది
భోక్తయగుచును సంతతాసక్తి నలరి
కర్మబంధమ్ములనుగడుఁ గలఁతవడును.

మూలము సం॥ 257 శ్లోకము.

షడ్భిరూర్మిభిరయోగియోగిహృద్భావితం నకరణైర్విభావితం
బుద్ధ్యవేద్యమనవద్యభూతియద్బ్రహ్మతత్త్వమసిభావయాత్మని.

ఆంధ్రము 258 గీతము.

తరగలాఱింట నొనరదు దొరకదింద్రి
యముల బుద్ధినిజిక్కదు విమలయోగి
హృద్విలాసము దోషరహిత విభూతి
యగు పరబ్రహ్మమీవని యరయుమెదను.

మూలము సం॥ 304 శ్లోకము.

యావద్వాయత్కించిద్విషదోషస్ఫూర్తిరస్తిచేద్దేహే
కథమారోగ్యాయభవేత్తద్వదహంతాపియోగినో ముక్త్యై.

ఆంధ్రము. 305-చంపకమాల.

గరళపు దోషమెంతయినఁ దాను శరీరమునందుఁ జేరి తా
స్థిరముగ నిల్చు నంతకును క్షేమమదెట్టులు లేక యుండునా
తెఱఁగున గర్వలేశము మదింగుదురొందిన నెట్టి యోగ సు
స్థిరమతియైనవానికిని చెన్నగనంబడఁబోదు ముక్తికై.

మూలము సం॥ 332 శ్లోకము.

శ్రుతిస్మృతిర్న్యాయశతైర్నిషిద్ధేదృశ్యేత్రయస్స్వాత్మమతింకరోతి। ఉపైతిదుఃఖోపరి దుఃఖజాలంనిషిద్ధ కర్తా స మలిమ్లుచో యథా.

ఆంధ్రము 333 మత్తేభము.

శ్రుతిధర్మంబుల న్యాయసమ్మతములన్ శుద్ధస్మృతిన్ యుక్తులన్
శతధామిథ్యగఁ ద్రోసివేయఁబడు నీసర్వమ్ముఁ దానంచు మూ
ఢతభావించునతండు దుఃఖములపైఁగా దుఃఖ జాలమ్ములన్
సతతంబుంగనుఁదూష్యకృత్యములు నిచ్చల్సేయుచుచున్నవాలెన్

మూలము సం॥ 537 శ్లోకము.

క్షుధాం దేహవ్యథాంత్యక్త్వా బాలః క్రీడతివస్తుని
తథైవవిద్వాన్రమతే నిర్మమో నిరహంసుఖీ.

ఆంధ్రము 538 కందము.

ఆఁకలి నలసట బాలుఁడు
చేకొనకొక దానినాటఁ జెలఁగెడుగతి సు

శ్లోకీరమించెడు బుధుఁడే
శోకటమోహమ్ముల నెన్నడుముఁ బొందక సుఖియై.

ఈ రీతినే మూల గ్రంథములోని 580 శ్లోకములకు-నన్నియు పద్యముల నిర్దుష్టముగ ననవసర శబ్దజాలమును దొరలనీక భావముఁ జెడనీయక సర్వమునురచించిరి. కవిత్వము ద్రాక్షాపాకమని దీనిని జదివిన వారికిఁ దోఁపకపోదు. ఇట్టి జ్ఞానబోధకములగు గ్రంథరాజములను జెక్కెంటి నీకవి వాక్కునుండి వెడలునట్లు పరమేశ్వరుఁడనుగ్రహించుఁగాక! సర్వజన సుబోధకములగు నిట్టి గ్రంథపఠనమున లోకము తరించును గాక!

ఏలూరు,
20—12—1932.

ఇట్లు,
సుధీవిధేయుఁడు
రాజా మంత్రిప్రెగడ భుజంగరావు.

---

# విజ్ఞాపనము.



సీ. విదిత సకలశాస్త్రసుధకు సముద్రమ్ము
విమలవేదాంతార్థవితతికి నిధి,
సంసారజలధి నిస్తరణకు వరికోల,
యమిత దయావరుణాలయమ్ము
వివిధదర్శన తత్త్వవిధసమిద్ధహానాగ్ని
నిజబోధతాచార్యాణ నియతిసుమతి,
గురువశిష్ఠ వశిష్ఠ గురుకేతనస్వామి
వర్ణనాతీత ప్రభావమూర్తి
గీ. అపరశంకరవిఖ్యాతి, యనమహాత్ముఁ
డైన శంకరు సద్గ్రంథమార! యేడ ?
కేవలాల్పుఁడనైన నాకృతి యదేడ ?
సహితభద్రగజంబేడ ? మశకమేడ !

సీ. పాడగరికయినెత్తి వడిఁదీయుఫలములఁ
బొట్టికేల్సాచి తాఁ బొందనెంచి
వైళంబ కడు నెగతాళిపాలైనట్లు
జడుఁడు సత్కవికీర్తిఁబడయనెంచి
యపహాస్యమునకు తావగురీతి నెఱిఁగియు
బత్తినెఱుక హత్తుపాత్రమగుటఁ
చపలబుద్ధినమిత సాహసమ్మునుబూని
నెఱుక కలిమిబలిమి నెఱిఁగినంత

ఆ. గూర్చినాడనిందు గుణముశంకరునిది
దోసఁగునాది కురుజు [illegible]ముఁగొని
జలము విడుచుక్రియ సారస్యమునఁగ్రోలు
టదిభవత్పుధర్మమార్యులార !

లోకంబున మానవులు జననమరణాది దుఃఖతరంగ విస్తారంబగు సంసార సముద్రోత్తరణ మొనరించి బ్రహ్మభావమునొందు పొంటె వేదాంత విచారమునఁ బొడము నద్వైతజ్ఞానమే సాధనంబుగ, "తమేనవిదిత్వాఽతిమృత్యుమేతి, నాన్యః పంథా విద్యతేఽయనాయ, బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి, తరతిశోకమాత్మవిత్, జ్ఞానాత్కైవల్యమశ్నుతే" యను పెక్కు శ్రుతులు వాక్రుచ్చుచుండుటయ గాక - ద్వైతము బంధమూలమనియు, నద్వైతము ముక్తికారణమనియు, "ద్వితీయాద్వ్యయంభవతి, య ఏతస్మిన్నుదరమంతరంకురుతే, అథతస్యభయం భవతి, మృత్యోస్సమృత్యుమాప్నోతి, య ఇహనానేవపశ్యతి, అభయం జనక ప్రాప్తోసి," అని తెల్పు సూక్తులంబట్టియు, అద్వైతజ్ఞానము మోక్షప్రదంబని సిద్ధాంతీకరింపఁ బడినది. అట్టి అద్వైతజ్ఞాన ప్రబోధకమగు నీ వివేకచూడామణి గురుముఖంబునఁ జదువునాడు గోలెఁ దద్గ్రంథ విషయప్రాశస్త్యము నాహృదయంబున కచ్చెరువుం గల్పించుచు సంతత సంస్మరణీయాదరణ గ్రంథముగాఁ బరిగణింపఁబడు చుండెడిది.

ఇట్టి మహోత్కృష్టములగు గ్రంథభావములను మిత్రమండలిలో నప్పుడపుడు వెల్లడించుచుండుతఱి సుహృత్‌బృందమును బ్రహ్మానందపారవశ్యంబున నీ పుస్తకరాజమును దెనుంగునకుం దీసికొనివచ్చిన బహుజనోపయోగ మగునని ప్రోత్సాహపరచుటచే నెట్లు కొనసాగఁగలదను భయమ్మ హృదయమ్మునఁ గ్రమ్మికొనినను దానియందు నాకుఁ గల యాత్మసక్యత నన్నుం బురికొల్పుటం జేసి సాహసించి ఆంధ్రీకరణమునకుఁ బ్రారంభించి శ్రీ శారదాంబా ప్రసాదమున పూర్తిగావించితిని.

ఏతద్గ్రంథమాతృకను రచించిన శ్రీ శంకరాచార్య ప్రతిభావిశేషాదికమునుసంగ్రహముగఁబీఠికలో మ. రా. రా. శ్రీ. శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరాయ బహద్దరు జమీందారు వారే సలక్షణముగఁ గ్రోడీకరించి యుండుటచేత నేనాపనిని చర్వితచర్వణమగునని తలంచి విరమించితిని.

నా యీ యాంధ్రీకరణము మూలశ్లోక సంఖ్యను పెంచక తగ్గించక భావానుసారముగ వ్రాయఁ గలిగితినని యానందించుట రసజ్ఞులు చదివి యానందించినపుడేగదా!

నా దృష్టిపథమున నీ వివేకచూడామణి యింతకు మున్ను ఆంధ్రీకరింపఁబడినట్లు లేదు. ఇది ప్రథమప్రయత్నమగుటచే నిందేవిషయమున నయిన లోపములున్న నట్టి వానిని ప్రాజ్ఞులు సౌహృదహృదయులై తెలిపిన ద్వితీయ ముద్రణమున నాదర పూర్వకముగ సవరించుకొందును.

నా యీ గ్రంథమును ఆమూలాగ్రముగ సావధాన మనస్కులై శ్రమయనక చదివి చక్కని విపులమైన పీఠికను వ్రాసి నా గ్రంథమునకు వన్నెఁ దెచ్చిన శ్రీరాజా మంత్రి పెరిగడ భుజంగరాయకవిరాజునకు నా మనఃపూర్వక వందనములు.

ఈ గ్రంథమును నేనురచించి ముద్రణ ప్రతి వ్రాయు తఱి నాకుం జేదోడుగ బహుకష్టంబుల కోర్చి విషయ సాంప్రదాయమున కుచితరీతుల మేధావిశేషముచే జిలుఁగు కుందనంబుఁబోలె నిమ్ముగ నలంకరించిన నా చిరమిత్రులు లక్కవరాస్థాన విద్వాంసులు పండితకవులు నగు బ్రహ్మశ్రీ కొత్తపల్లి సుందరరామకవివర్యున కనేక కృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

లోకమున నల్పజ్ఞుఁడ నగు నాకు అద్వితీయ జగత్ప్రథిత కీర్తిమూర్తి యగు శ్రీ జగద్గురు శంకరభగవత్పాదాచార్య స్వామి ఈ యాంధ్రీకరణ గౌరవావకాశమును గలిగించినం దులకు అమ్మహానుభావునకు సంతత స్మరణపూర్వకానేక సాష్టాంగ నమస్కృతులు.

దెందులూరు,
20—12—32.

గ్రంథకర్త:
మొటపర్తి చినసోమయ్య శాస్త్రి.

# కృతిసమర్పణము.

సీ. కలనైన నపకృతి ◆ దలపకెవ్వరికేని,
యనిశోపకృతిసేయు ◆ జనహితుండు,
ధనమనఃప్రాణ సం ◆ తతిఁగుంటువారిక,
బుధనిష్ఠజనుపు సూ ◆ నృతవచస్వి,
కులగిరులొక్కట ◆ దలక్రిందులైన స్వ
ధర్మమ్ము దప్పని ◆ కర్మయోగి
మోక్షసామ్రాజ్య వి ◆ భూతినందఁగ భక్తి
భవ్యమంచెఱిఁగిన ◆ భజనపరుడు

గీ. ఐహిక కృతార్థుఁడై దివి ◆ నందినట్టి
సహజునకు రామస్వామి ◆ చౌదరి కిది
సోదరార్పితమగు నివా ◆ పోదకముగ
నక్షరముఖమ్ము సంప్రణా ◆ యాంకమగుత.

ఇట్లు,
గ్రంథకర్త.

XVI

# OPINION.

Dear Sir,

Thank you for your kindness in sending me the Telugu version of Viveka Chudamani. I am not competent to Pronounce any opinion on its quality as a piece of poetry, but I dare say that your work will be found extremely valuable by all Telugu students who are unfamiliar with Sanskrit. Your fidelity to the original and fluency of expression are quite commendable.

*Yours Sincerely,*

WALTAIR, 4—4—193. } (Sd).S. Radhakrishnan, M.A.,

Vice Chancellor, Andhra University, Waltair.

---

# విద్వదభిప్రాయములు.

శ్రీయుత ఆంధ్రయూనివర్సిటీ వైస్‌ఛాన్సెలర్,

యస్. రాధాకృష్ణన్‌గారు, యం. ఏ,

వాల్తేరు, ది **4-4-1933.**

ఆర్యా, వివేక చూడామణి తెలుగుపద్యకావ్యముగ వ్రాసిన ప్రతి మీరు దయతో పంపించినందులకు మీ కనేక వందనములు. పద్యకావ్యము మీద దానివిలువనుగూర్చి నేనభిప్రాయమిచ్చుటకు సమర్థుఁడను కాను. కాని సంస్కృత భాషాజ్ఞానములేని తెలుగు విద్యార్థుల కందరికి మీగ్రంథము చాలా విలువగలదిగాయుండునని నేను నొక్కి వక్కాణించుచున్నాను. మీకు తెలుగు భాషయందున్న గౌరవమును, భాషాభిప్రాయమును వెల్లడి చేయుటయందుగల మీనేర్పున్నూ చాలా కొనియాడదగినది.

కింకవీంద్ర ఘటా పంచానన, బాలసరస్వతి, ఆశుకవిచక్రవర్తి,
బాలకలానిధి, శతావధాని,

బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ళ వేంకటశాస్త్రిగారు,

కడియము, 10—2—33.

అయ్యా, మీరు పంపించిన శ్రీమదాంధ్రవివేకచూడామణి చేరినది. స్థాలీపులాక న్యాయముగ నా గ్రంథమును చదివి చూచినాను. ఆంధ్రీకరణము మూలానుసారముగ నున్నది. కవిత్వము రసవంతమై లాక్షణిక విషయమున నేమి, ధారా విషయమున నేమి, మిక్కిలి చక్కగానుండి శ్లాఘనీయముగా నున్నది. భగవంతుఁడు మీకిట్టి సద్గ్రంథరచనకుం దగిన యాయురారోగ్యములు ప్రసాదించుగాక యని కోరుచున్నాను.

---

శ్రీయుత కవిశేఖర వడ్డాది సుబ్బారాయుడుగారు.
విశ్రాంతిగొన్న రాజకీయ కళాశాలాంధ్రపండితులు.

రాజమహేంద్రవరము, 24-3-33.

అయ్యా, మీరు సాదరముగా భవద్విరచితము, శ్రీమదాంధ్రవివేకచూడామణి నాకు నంపినందులకు మీకు నేను కృతజ్ఞుడను. తద్గ్రంథ విషయమున నా యభిప్రాయమును వెంటనే తెలుపవలెనని మీరు కోరుట చేత నది సాంతముగా జదువ వలనుపడక, నచ్చటచ్చట మాత్రము చదివి మీకవిత్వధోరణికిని తత్తద్వినియోగమునకును మిగుల సంతసించితిని.

క. మానవజన్మము మోక్షపుఁ
బూనికమహనీయుఁడైన పురుషునికొలవున్
మానుగ దుర్లభ మివియగు
నైనఁ బరాత్పరునికరుణ నమరును మూఁడున్.

దిఙ్మాత్రముగ బయి చిన్న పద్యమొకటియు మూలముతో బోల్చి చూడగా సరసముగా మూలభావము ప్రకటించినట్లు తోఁచుచున్నది.

పారమార్థిక గ్రంథము నాంధ్రీకరించి భగవత్పాదుల మహిమా సాంద్రత్యము లోకోపకారముఁ గావించినందులకు నత్యంతము మిమ్ము నేను శ్లాఘించుచున్నాను. కవిత్వము రసవంతము.

---

ఆంధ్రయూనివర్సిటీ తెలుఁగు లెక్చరరు

శ్రీయుత పింగళి లక్ష్మీకాంతంగారు, ఎం. ఏ.

**విశాఖపట్టణము, 16-2-33.**

ఆర్యా, మీ వివేకచూడామణిని శ్రద్ధతోఁ జదివితిని. చాలసరసముగానున్నది. వస్తుతత్త్వమునుబట్టి వేదాంతము కవిత్వమునకుఁ బనికిరాని వస్తువని కొందఱి యభిప్రాయము. కాని

"రమ్యం జుగుప్సిత ముదార మథాఽపి నీచ
ముగ్రం ప్రసాది గహనం వికృతం చ వస్తు
యద్వా ప్యవస్తు కవి భావక భావ్యమానం
త న్నాస్తి య న్న రసభావ ముపైతి లోకే"

అని ధనంజయుఁడన్నట్లు, కవిచేత భావ్యమానమై రసభావమును బొందని వస్తువేలేదని నాయభిప్రాయము. దీనికి మీ వివేకచూడామణియే తార్కాణ. మీగ్రంథము సర్వథా సీతారామాంజనేయమునకు సెనయై ఆంధ్రవాఙ్మయమున శాశ్వతముగా నిల్చియుండుననుటకు సందేహము లేదు. ఈగ్రంథమున నంతర్వాహినిగా మీయాత్మసాధనయుఁ బొడకట్టుచున్నది. ఆసాధనయే లేనిచో మీరీగ్రంథమునే తలపెట్టియుండరు. ఆసాధనను గూర్చి విమర్శవాక్యములు వ్రాయుశక్తి నాకులేదు. అది యియ్యెడ నప్రస్తుతముగూడ.

మీపద్యరచన ప్రసన్నమును, బ్రశాంతమునై శరన్నదివలె నున్నదనుట యతిశయోక్తి కాఁజాలదు.

---

మ. రా. శ్రీ క్రొత్తపల్లి సూర్యారావుగారు,

మేనేజరు, ఆంధ్రసాహిత్యపరిషత్,

కాకినాడ, 20-2-33.

మహాశయా, తాము దయతోఁ బంపిన శ్రీమదాంధ్ర వివేక చూడామణి నందుకొని యానందించితిని. ఇక్కాలంబున నిట్టి వివేక గ్రంథములను జదువువారే యరుదు. చదివినవారిలో గురుముఖమునఁ దెలిసికొనిన విషయములను సుబోధముగ నితరులకుఁ దెలియఁజెప్పు ప్రజ్ఞ గలవారు తక్కువ. అట్టిప్రజ్ఞగలవారిలోఁ బద్యరూపమున మూలభావము నెల్లఁ దెచ్చువారు కనఁబడరు. కానఁబడువారిలో నుభయ భాషలలోను జక్కని ప్రతిభగలిగి నిర్దుష్టము లలితమునైన పదప్రయోగము చేయువారు మృగ్యులు. అట్టిచో మీయాంధ్రీకరణ ప్రయత్నము ముదావహముగ నున్నది. శ్రీ శంకరాచార్యుల వారి సిద్ధాంతములందు మిక్కిలి యభిమానముతోఁ బరిశ్రమ చేసియుండని యెడల నిట్టి మృదుమధుర పాకమున గ్రంథము వెలువడి యుండదు.

"బుధులై శాంతులునై మహాత్ములు" అను 38 వ పద్యమునకు "శాన్తా మహాన్తో నివసన్తి సన్తః" అని మూలమునఁగల శబ్దాలంకృతిని దెనుఁగునఁగూడ నొకవిధముగఁ దెచ్చిన బాగుగ నుండును. మఱియుఁ బంచపాది విలక్షణముగా నున్నది. కాని యిట్టి యభిప్రాయ భేదములు స్వల్పవిషయములు.

ఈ యాంధ్ర వివేకచూడామణి యాంధ్ర వివేక చూడామణుల యాదరమున ద్వితీయముద్రణమునకు శీఘ్రముగా వచ్చుననియు నప్పుడు తెలుఁగుపద్యములకుఁ బైనిమూల శ్లోకముఁగూడఁజేర్చి ప్రకటించెదరనియును నమ్ముచున్నాఁడను.

## కవిసార్వభౌమ ఉమర్ ఆలీషా కవిగారు,

పీఠికాపుర సంస్థానాస్థాన పండితులు, 20—2—33.

ఉ. శ్రీమహితుండు శంకరుఁడు చెప్పిన తాత్వికమౌ వివేక చూ
డామణి నాంధ్రభాషను కడాని ముదంబున మోటపర్తి శ్రీ
సోమయచౌదరీ కవి విశుద్ధుఁడు మూలమురీతి వ్రాసె వి
ద్యామతి యోగమార్గము ప్రయాణము జేసెదు వారిఁ దోడ్పడన్.

ఉ. కామ వికార సంజనిత కర్మదవానల మార్పివైచి వి
ద్యా మహితంబునై వెలయునట్టి వివేకమె యీ వివేక చూ
డామణి యిట్టి గ్రంథమును డాసి ధరన్ మొటపర్తివంశ్యుఁడౌ
సోమయ చౌదరీ సుకవి శోభిలె జన్మ తరించునట్లుగన్.

తే. గీ. కవిత మిక్కిలిరసమునఁ గ్రాలుచుండె
భావములు తేటతెల్లమై పరిఢవిల్లు
అర్థము సుబోధకంబుగా నలరుచుండె
నిఁక వివేకచూడామణి కేమి కొదువ
సుగుణగణధుర్య మొటపర్తి సోమయార్య!

---

లక్కవరాస్థాన విద్వాంసులు. విద్వత్కవులు నగు
శ్రీయుత కొత్తపల్లి సుందరరామకవి గారు,

ఏలూరు, 16—2—1933.

ఉ. స్వామి జగద్గురు ప్రవర ♦ శంకర సత్కృతమౌ వివేకచూ
డామణి కావ్యరత్నమును ♦ డంబు మెయిన్ బఠియించి వ్రాసినన్
శ్రీమున విన్న తత్ఫలము ♦ కోటి గుణంబని పెద్దలందురా
నీమము క్రేవ నాంధ్రమున ♦ నేనది వింటి బఠించి వ్రాసితిన్
సోమసుహృత్కవి ప్రచుర ♦ సూక్తి మహత్తర బంధురక్రియన్.

క. కర్పూరపుఁ బలుకు లొప్పెడు
చొప్పున మీ పలుకు లొప్పె ♦ సోమకవీ? మేల్
గుప్పితిరి శబ్దజాలముఁ
దప్పక మూలార్థ భావ ♦ తత్త్వ రసములన్.

---

శ్రీయుత నిడుమోలు కనకసుందరకవిగారు, ఎమ్.ఏ.,

ఏలూరు, 23—2—33.

గీ. తత్త్వ వేదాంతసార దుగ్ధములఁ దఱచి
భవ్య నవనీత మద్వైత భావమబ్బ
సంస్కృత గ్రంథమున దాని సంతరించె
నపరశంకరుఁడా శంకరార్యుఁడెపుడొ.

క. సలలిత పద కవితము, మధు
నలరించు విశుద్ధభావనాలంకృత, మెం
దుల మెచ్చికోలుఁ గొనఁదగు
పలుకున నది నేఁడు తెలుఁగు బాసను గననౌ.

క. చిన సోమయకవి చిక్కని
తెనుఁగున కవనంబుసేసె తేనియవోలెం
గనుపడ తత్త్వార్థంబులు
తనివిం గనఁగోరి జనులు ధన్యతఁజెందన్.

---

బ్రహ్మశ్రీ కలువలపల్లి రంగనాథశాస్త్రిగారు,

ఏలూరు, 16—2—1933.

మ. యతిచంద్రుండగు నాదిశంకరుఁడు మో ♦ క్షావాప్తి మార్గమ్ములం
బ్రతిపాదించెడు గ్రంథముల్ సలిపె వి ♦ ద్వద్వేద్యముల్ నాన్ధ్రబం
డితుఁడాసం దనుడాసివేఁడెను సదం ♦ తేవాసికిన్ సాధుప
ద్ధతిబోధించెఁ బ్రహృష్ట చిత్తుఁడగుచున్ ♦ దత్త్వోపదేశంబువన్.

సీ. పటుతరమ్ముగ నాంధ్ర భాషను గడియించి
యమరభాషాపరిశ్రమ మెంనర్చి
చింతలపాటి లక్ష్మీపతి బుధుఁగొల్చి
వినతిపై వేదాంత విధము లెఱిఁగి
ఆదిశంకరకృత మగు సద్వివేక చూ
డామణి పండిత స్తోమగణ్య
భంగి నసదు మూల భావమ్ముఁ బోనీక
దిట్టవగుచుఁ జక్కఁ దెనుఁగుఁ జేసి

తే. ర ! మొటపర్తి వంశదుగ్ధాబ్ధిసోమ !
సోమ సత్కవి ! శంకర స్వామికరుణఁ
బ్రీతినెల్లరుఁ జెలఁగి యద్వైతసుధను
దనివిఁ దీరఁగఁ గ్రోలెడు తలఁపుఁదలఁచి.

---

ఆంధ్రభారత పరిష్కర్త, దేవదత్తంపత్రిక సంపాదకులు,
శ్రీయుత మున్నంగి లక్ష్మీనృసింహశర్మగారు.

ఏలూరు, 20—8—1933.

గీ. సఖ ! వివేక చూడామణి ♦ శంకరకృతిఁ
దెలిసి దెలిపితి వనువగు ♦ తెలుఁగుబాసఁ
జేతఁజూపెడు తెలువు నీ ♦ వ్రాఁతఁజూపి
సుకృత చరితుండవైతివి ♦ సోమసుకవి !

---

బౌద్ధవాఙ్మయ బ్రహ్మ
శ్రీయుత దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు,
శ్రీ గౌతమబుద్ధ సేవాశ్రమము, అంగలూరు, (కృష్ణాజిల్లా).

ఆర్యా, మీరు దయతోఁ బంపిన "శ్రీమదాంధ్ర వివేక చూడామణి" వందుకొంటిని. అస్వస్థుఁడనయి యుండుటచే సత్వరము మీరు కోరిన మేరకు నా యభిప్రాయమును బంపఁజాలనయితి. క్షంతవ్యుఁడ.

"శ్రీమదాంధ్రవివేక చూడామణి" అద్వైత విజ్ఞాన భాస్కరుఁడగు శ్రీ శంకరాచార్యుని గీర్వాణ వివేకచూడామణికి విశుద్ధాంధ్రానువాదము. ఇయ్యది తత్త్వమీమాంసచే భారతీయ ధార్మిక సాహిత్యమున గణుతికెక్కిన గ్రంథరాజము. ఇట్టి ప్రశస్త గ్రంథ రత్నము నాంధ్రీకరించి ఆంధ్రభాషాపధూటికి నొక యమూల్యాలంకారమును సమకూర్చిన మీరు కడుంగడు సంస్తవ పాత్రులు.

ఈ గ్రంథ మాద్యంతము మానవజీవితసంతరంగావశ్యకములగు ధర్మములతో నలరారుచున్నది. ఇందలి శైలి సరళము, మధురము, మృదులము, కుంటువోని గమనము. సుస్పష్టభావగాంభీర్యము మీ శైలికి వన్నెనిడుచు గ్రంథ ప్రాశస్త్యము నినుమడింపఁజేయు చున్నది. మూల గ్రంథ మందలి యున్నత భావముల గరిమను, భాషాలాలిత్యమును, రచనాసౌష్ఠవమును చుఱుకరి స్మృతిపథమునకుఁ దేగల భాషాంతరీకరణమని యనుటలో నతిశయోక్తి లేదు. జటిలము, ప్రౌఢము, గంభీరము నగు నధ్యాత్మ విషయము మీవంటి కవీంద్రుని సహజసరళశైలి యందుఁ జిత్రింపఁ బడినపుడే సార్థకము కాఁగలదు.

శంకరునివంటి లోకోత్తర ప్రతిభాసముపేతుని అసదృశ విజ్ఞానపేటికయగు వివేకచూడామణిని దెనిఁగించి ఆంధ్రసాహితీపూజావేదికపై నొక యర్చనాకుసుమముగ సమర్పించ నోచిన మీరు ధన్యులు. చిరస్మరణీయులు.

ఆంధ్రముముక్షులోకము, విద్వత్కవి ప్రపంచ మీ యుత్తమోత్తమాంధ్రకావ్యమును సమాదరింప నంజలి ఘటించి ప్రార్థింతు.

శ్రీయుత కనకవల్లి భాస్కరరాయకవిగారు,
సహకార పరపతిసంఘముల రిజైర్డు డిప్యూటీ రిజిస్ట్రారు.
నాయుడుపేట, 19-3-33.

మీరు పంపిన "శ్రీమదాంధ్ర వివేకచూడామణి" యను గ్రంథమును వందనములతో నందుకొంటిని, "భాగవతము తెలిసిపలుకుట చిత్రంబు శూలికైనఁ దమ్మిచూలికైన" యని పోతనయంతటి మహనీయుఁడు వచించెను. ఇట్టి విషయమునుగూర్చి స్వతంత్రముగ గ్రంథమును వ్రాయుటయే దుర్ఘటమైనకార్యము. అట్టిది సంస్కృతమునందు, ఆది శంకరభగవానునిచే రచియింపబడిన యిట్టి యసామాన్యకావ్యమును పద్యరూపముగ నాంధ్రీకరించుటయు, ఒకశ్లోకములోని విషయమును ఒక పద్యములో నిముడ్చుటయు, అందును "కందపద్యమును వ్రాసినయతఁడు కవి" యను సామెతకు నిదర్శనమగునటుల నధికముగ కందపద్యములు వ్రాయుటయు, యతిప్రాసాదులకై వ్యర్థపదములను దెచ్చిపెట్టుకొనకుండుటయు, కవియొక్క అసామాన్య సామర్థ్యాతిశయముం బ్రకటించుచున్నవి. తేట తెలుఁగుమాటలతో తేనెలొలుకునట్లు వ్రాయఁబడిన యీక్రింది పద్యములను స్థాలీపులాకన్యాయముగఁ జూపుచున్నాను.

క. ఋణమోచనమ్ము నొనరుప
దనయులు మనుమలును గలరు తండ్రికి; భవబం
ధన మోచనమ్ము నొనరుపఁ
దనకంటె నెవండులేడు ధరఁ బరుఁడుబుధా.

క. తలమీఁదనున్న బరువునఁ
గలిగిన దుఃఖమును బరులుకడఁ ద్రోచెదరాఁ
కలిబాధ యేరివలనను
దొలఁగింపఁగఁబడదు తాను దొలఁగింపనిచోన్.

ఈ క్రింది పద్యము నెన్నిసారులు చదివినను ఇంకను చదువవలయుననియే బుద్ధి పుట్టుచుండును.

క. పరతత్త్వము దెలియమిఁ దన
వరశాస్త్రాధ్యయన మెల్ల వ్యర్థంబయగుం
బరతత్త్వము నెఱిఁగినఁ దన
వరశాస్త్రాధ్యయనమెల్ల వ్యర్థంబయగున్.

ఈ కావ్యమునందలి గుణములను వర్ణింపవలయుననిన నదియొక గ్రంథమగును. "ఒనరన్ నన్నయతిక్కనాదికవులీ యుర్విం బురాణావళుల్ । తెనుఁగుం జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దానెట్టిదో। తెనుఁగుం జేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా। జననంబున్ సఫలంబుఁజేసెదఁ బునర్జన్మంబు లేకుండగన్" అను పోతన వాక్యము మీకు సంపూర్ణముగ వర్తించును. గ్రంథవిషయము సామాన్యజన దురవగాహమగుటంజేసి యిందు కొన్నిపద్యములకైనఁ దాత్పర్యము వ్రాసిన గ్రంథోపయోగము ద్విగుణితంబగునని మదాశయము. గ్రంథము అచ్చుపడినదిగనుక విడిగా పద్యసంఖ్యల నుదాహరించి తాత్పర్యము వ్రాసి ముద్రింపించి దానిని పుస్తకముచివరను చేర్చవచ్చును. మీరువ్రాసిన తక్కిన గ్రంథములను జూడఁగోర్కె యొదవుచున్నది. వానిం బంపవేడెద.

1

శ్రీరస్తు.

# శ్రీమదాంధ్ర వివేకచూడామణి.



—♦ మూలగురుస్తుతి. ♦—

క. సకలాగమాంత సిద్ధాం
తకవిజ్ఞుఁ డగోచరుండు తత్త్వానంద
ప్రకటితచిత్తుండగు దే
శికవరు గోవిందు నతులు సేసెద నెపుడున్. 1

—♦ ఆత్మగురు స్తవము. ♦—

ఉ. తాపహతమ్ము చిత్సుఖ నిదానము మృత్యు వినాశనమ్ముఁదృ
ష్ణాపహమున్ విశుద్ధము భవామయదివ్యరసాయనమ్ము నా
శ్రీపరతత్త్వబోధసుధఁ జిల్కిన చింతలపాటి వంశ్యు ల
క్ష్మీపతి దేశికు న్విబుధసేవితు జ్ఞాననిధిం దలంచెదన్. 2

—♦ ముక్తి అనేక జన్మపుణ్యార్జితము ♦—

సీ. జంతుకోటిని నరజన్మముత్తమ, మందుఁ
పురుషుఁడై పుట్టుట పరమపుణ్య
మగు, నందు బ్రాహ్మణుండై జనించుట శ్రేష్ఠ,
మందు సత్కర్మిష్ఠుఁడగుట లెస్స
యగు, నందుఁ బండితుండై తరించుట ఘన,
మందు నాత్మవివేకియగుట పూజ్య
మగు, నందు స్వానుభవుండై తనర్చుట శ్రేయ,
మందు "సర్వం బ్రహ్మ" మనెడిబుద్ధి

గీ. నందుటతిశయ, మందుఁ దానోనర ముక్తిఁ
గాంచు టబ్బురమగు మదినెంచ నదియుఁ
గోటిజన్మములను నోడఁగూర్చు పుణ్య
సంతతినిగాక దొరకదు సత్యముగను. 3

—♦ దైవానుగ్రహజనితములు ♦—

క. మానవజన్మము మోక్షుపుఁ
బూనిక మహనీయుఁడైన పురుషుని కొలువున్
మానుగ దుర్లభ మివియగు
నైనఁ బరాత్పరుని కరుణ నమరును మూఁడున్. 4

—♦ పండితుఁడైన ముముక్షువుకానివాఁ డాత్మహంత ♦—

చ. ఎటులతి కష్టసాధ్యమగు సీనరజన్మముఁబూరుషత్వముం
బటునిగమాంతదర్శన సుభాగ్యమునొందియు మందబుద్ధియై
గటకట! మిథ్యనాఁదగుజగమ్మనునమ్ముచుఁదానుముక్తినొం
దుటకుఁ బ్రయత్నముంగనని దుర్మతిపేర్వడునాత్మహంతయై. 5

—♦ మూఢుఁడు ♦—

క. అతిదుర్లభ నరజన్మ
స్థితిఁబౌరుష ధర్మగుణముఁ జెందియుఁ ధనస
ద్గతిఁజూడకుండునా దు
ర్మతికంటె నెవండు మూఢమానసుఁడు భువిన్. 6

—♦ ఆత్మజ్ఞానము ముక్తికిఁ గారణము ♦—

ఉ. వేలుపుబాసఁదెల్పినను వేల్పులజన్మములందుఁ దన్పెనే
నోలిగ దానధర్మ ఘనహోమజపాదుల నెన్నిచేసినన్
వేలుపులన్భజంచినను వేడుకనాత్మ వివేకిగానిచోఁ
గాలములెన్ని యేగినను గానిలభింపదు మోక్షమెవ్విధిన్. 7

—♦ కర్మ ముక్తిప్రదముగాదు ♦—

క. శ్రుతి ముక్తినొందఁ గర్మ
ప్రతతి నహేతువుగ నెన్నవచియించుటచే
క్షితి ముక్తి గలుగకుండెడు
నతులిత కర్మస్వరూపమగు ద్రవ్యములన్. 8

—♦ పండితవిధి ♦—

ఉ. కావునఁ బండితుండు భువిఁ గర్మచయంబుల నెల్ల వీడి స
త్పోవిదుఁడౌ గురూత్తముని కూరిమిఁ జెందిగురూపదిష్టసం
భావిత తత్త్వవాగ్రుచి సమాహితమానసుఁడౌచు నిత్యసౌ
ఖ్యావహమైన మోక్షపదమందఁ బ్రయత్నము సేయఁగాదగున్.

క. సముచితమగు సద్బోధను
విమలంబగు యోగసిద్ధి విడఁ డొందిసదా
భ్రమయక సంసారసము
ద్రమునమునుఁగు దన్నుదానె దరిఁ జేర్పవగున్. 10

క. వేదాంత విద్యానయము
మోదముగను ధీరులైన బుధులెల్లఁ బనుల్
కాదని విడిచియు భవముల
ఛేదింపఁగ యత్నమొనరఁ జేయఁగవలయున్. 11

—♦ కర్మచిత్తశుద్ధిప్రదము ♦—

క. హృదయము శుచియగు కర్మను
సదమల వస్తూపలబ్ధి సమకూడదు తా
నొదవెడు జ్ఞానమువలనను
నొదవదు కర్మాళి నెప్పుడొక్కింత భువిన్. 12

—♦ యథార్థము పరిశీలనా జనితము ♦—

క. భ్రమవలన జనితమగు స
ర్పమయను భయ దుఃఖములనుఁ బాపెడిత్రాడన్
సుమనోనిశ్చయభావం
బమరు విమర్శనము లెస్సఁ నంమటచేతన్. 13

—♦ గురువాక్య చింతనము. ♦—

క. పరమార్థ నిశ్చయత్వము
గురువచన విచారణమున గుర్తింపఁబడున్
దొరకదు దానముచేతను
శరధి స్నానమున యోగశతములనైనన్. 14

—♦ యోగ్యతసిద్ధికిఁ గారణము. ♦—

క. ఫలసిద్ధి మిప్పుడు యోగ్యత
కలవారలఁ దెల్పు దేశకాలాదులు త
త్ఫలసిద్ధి నొందువారల
కలరఁగ నుపాయంబులగు నుపాయములు ధరన్. 15

—♦ జిజ్ఞాసు విధి. ♦—

క. కాన ముముక్షువుదయగల
జ్ఞానోత్తముఁడైన గురుని సాన్నిధ్యమునం
దానొడిగి యాత్మ తత్వ
జ్ఞానము నొందుటకుఁ జర్చ సలుపఁగవలయున్. 16

—♦ బ్రహ్మవిద్యాధికారి. ♦—

క. భావవిభేదజ్ఞుఁడు, మే
ధావియుఁ బుంగవుఁడు వస్తుతత్వజ్ఞుఁడు సం

భావిత లక్షణ లక్షిత
కోవిదుఁడధ్యాత్మవిద్యఁగాన నగు్నాఁడిలన్. 17

—♦ పరమాత్మజ్ఞాని ముముక్షువు. ♦—

క. శమదమగుణ సంశీలుఁడు
ప్రముదితచిత్తుఁడు విరాగి భవ్యవివేకో
త్తముఁడైన ముముక్షువునకుఁ
గోమరొప్పఁగ బ్రహ్మనెఱుఁగుకోర్కి జనించున్. 18

—♦ జ్ఞా న సా ధ న ము లు ♦—

క. ఎవియున్న జ్ఞానమొదవెడు
భువినెవిమతిలేకయున్నఁ బుట్టదుజ్ఞానం
బవినాల్గు సాధనములగ
వివరించిరి బుధులు సద్వివేకముపొంటెన్. 19

—♦ సాధన చతుష్టయము ♦—

క. నిత్యానిత్యవివేకం
బత్యంత విరాగమిాయిహాముత్రములన్
స్తుత్యము శమాదిషట్కము
ప్రత్యహమును మోక్షకాంక్షఁ బడయుటయుఁదగన్. 20

—♦ ని త్యా ని త్య వి వే క ము ♦—

క. సత్యము బ్రహ్మముపృథివియ
సత్యమ్మను నిశ్చయమ్ము సాధించుటయే
నిత్యానిత్యవివేకము
సత్యంబీవాక్య మమృతసారంబయగున్. 21

—♦ వై రా గ్య ము ♦—

ఉ. సంతత హేయవస్తువిషయంబు సౌఖ్యము రోసి శరీరమాది బ్ర
హ్మాంతమనిత్యవస్తువని యాత్మదలంచుచునింద్రియాళి నా
వంతయు దర్శనశ్రవణ పాటులనాటకమాటిమాటికిన్
స్వాంతమునందువింతగనసహ్యమునొందుటయేవిరాగమా.

—♦ శ మ ము ♦—

క. అతిదోష దృష్టివిషయ
ప్రతతిని విడనాడిమివుల వైరాగ్యమునన్
సతతము స్వలక్ష్యమందున
మతిఁదిరముగఁ బాదుకొల్పి మనుటశమమగున్. 23

—♦ ద మో ప ర తు లు ♦—

క. దమమగు విషయవిరక్తిని
తమనెలవుల నింద్రియముల స్థాపన జేయం
దమికొనక బాహ్యవిషయపు
దమనము చిత్తమునఁ బొడమదగు నుపరతియై. 24

—♦ తి తీ క్ష . ♦—

క. చింతను విలాపమును గొన
కెంతయు నపకారమెంచ కెదనోర్పుమెయిన్
వంతలనెల్ల నడంచుట
యంతేవాసీ! తితీక్షయనఁబరగుధరన్. 25

—♦ శ్ర ద్ధ . ♦—

క. గురువాక్యమందు శాస్త్రముఁ
బరిచయమున సత్యబుద్ధిఁ బడయుట దేనిం

బరమాత్మ లభ్యమయ్యెడు
స్థిరముగనది శ్రద్ధయనంచుఁ జెప్పుదురుబుధుల్. 26

—♦ స మా ధా న ము . ♦—

క. కాలత్రయమందున నే
కాలమ్మున మదిని బ్రహ్మఁ గదలక కూర్పన్
మేలైన సమాధి; మనో
లాలనము సమాధిగాదు ప్రజ్ఞానిధీ! 27

—♦ ము ము క్షు త . ♦—

క. అవివేకముచేఁ బొడమిన
భవబంధము లాత్మరూప భాగ్యముగనుచో
నవలీలఁ ద్రెంచుఁ గామ్యం
బవని ముముక్షుత్వ మనఁగ నలరుచునుండున్. 28

—♦ మోక్షాభివృద్ధి ఫలప్రాప్తిమూలము ♦—

క. శమదమ గుణములవిరతిని
క్రమముగ సద్గురునికృపనుగని మందము మ
ధ్యమరూపంబులఁ బాసియు
ముముక్షుత సువృద్ధినొంది మోక్షముగూర్చున్. 29

—♦ వైరాగ్యము ముక్షుతాభివృద్ధి-శమదమాది ఫలసిద్ధి ♦—

క. వైరాగ్య ముముక్షుత్వము
లీరెండెయ్యెడను దీవ్రవృద్ధింగనునో
మీఱుచు ఫలితములై యట
వారక శమదమము లర్థవంతములరయన్. 30

—♦ వైరాగ్యము ముముక్షుతా క్షీణత శమదమాదుల క్షీణత్వము ♦—

క. విరతియును మోక్షకాంక్షయు
నరయఁగ మందమ్ములైనచట నగునోయచటం
గుఱుచలయి శమదమాదులు
మరుభూమి జలంబువోలె మందమ్ములగున్. 31

—♦ భక్తి ముక్తికిముఖ్యము - భక్తి వివరము ♦—

చ. అరయఁగ మోక్షమార్గములనన్నిటియందునభక్తిమార్గమే
గరిమమటంచుఁబండితనికాయమువల్కెడుఁ;గొందఱీభువిన్
స్థిరముగస్వస్వరూపమునుజింతనసేయుటభక్తియంద్రు కొం
దఱుమఱిస్వాత్మతత్త్వపుయథార్థముభక్తిగఁదెల్పుచుండెడిన్

—♦ సాధనసంపత్తిగల శిష్యవిధి ♦—

క. సాధన సంపన్నత స
ద్బోధాత్ముని భవవిముక్తిఁ బొందించెడి స
ద్వేదాంత వేద్య గురువరు
బోధనుగనఁ జేరవలయుఁ బొత్తునమఱియున్. 33

ఉ. పాపవిదూరుఁడున్ బుధుఁడుబ్రహ్మవిదుండునకాముకుండుబ్ర
హ్మోపరతుండు శాంతగుణుఁడుజ్జ్వలవహ్నిసమప్రభావుఁడుం
దాపహతుండుమూఢజనతారణుఁడుంగరుణామయుండునై
యోపిక శిష్యసత్తములకొప్పుగఁ దెల్పెడు దేశికున్సదా. 34

క. ప్రాపుగొని మిగుల భక్తిం
దోపంగా నమ్రవినయ తోషితపూజో
ద్దీపితచేతసుఁజేయుచు
నోపికఁ బ్రశ్నింపవలయుటొప్పు నిజతకున్. 35

—♦ శిష్యప్రార్థన ♦—

ఉ. ఓనతలోకబంధు ! కరుణోదధి ! సంసృతి సింధువున్ దరిం
గానక మగ్నమైన నను గ్రక్కున యోగ్యదయాభివృష్టి స
న్మానితమౌకటాక్షమున మందజనావన! యుద్ధరింప ని
న్మానసమందుఁగొల్చుచునమస్కృతిఁజేసెదనోమహాప్రభూ!

ఉ. ధీరుఁడఁగాను ఘోరదురదృష్ట సమీరహతుండ భీమసం
సారదవాగ్ని తప్తుఁడను శాంతివిహీనుఁడ మూఢచిత్తుఁడన్
భీరుఁడ సత్ప్రపన్నుఁడ నభేదుఁడ నన్నుృతినుండి కావునా
కారయనీవతక్క నిఁక నన్యశరణ్యము లేదొకింతయున్. 37

—♦ మహాత్ములులోకపవిత్రులు. ♦—

మ. బుధులై శాంతులునై మహాత్ములుసదాపూజ్యార్హులైలోకస
ద్విధికై యామనిపోలికంగడఁగి సద్విద్యావిలాసంబునం
బ్రధితజ్ఞానముఁగూర్చి భీమభవపారావారమున్ దాఁటి య
త్యధిక ప్రేమనహేతుకంబుగను నన్యాళిందగన్వారకం
బుధిదాఁటించి తరింపఁజేయుదురుసంపూర్ణప్రభావంబునన్.

చ. ఖరకరకర్కశ ప్రభలఁగ్రాఁగు ధరిత్రిఁ దనంతఁదాసుధా
కరుఁడు మరీచి పుంజములఁగ్రమ్ముచుఁ జల్లదనమ్మునింపు న
ట్లరయ మహానుభావు లగునట్టిడులందగఁబుట్టు వందునే
నిరతపరశ్రమాపహరణీయకకృత్యముసత్స్వభావమౌ. 39

—♦ తాపనివారణప్రార్థన ♦—

మ. భవతాపంబను కారుచిచ్చునడితాపంబందునన్ శీతముల్
శ్రవణానందములుం బవిత్రములు సత్సౌఖ్యానుభూతమ్ములై

భువినే పాఘభవద్వచోమృతములం బ్రోక్షింపు మొప్పం బ్రభూ!
భవదీయేక్షణసంగతుల్ నిజమ్ముగన్ భద్రాత్ములౌ ధన్యులున్.

ఉ. ఈభవసాగరంబెటుగ నీదుదు నాకెదిదిక్కు నిల్చుచో
నీభువినేయుపాయము రహించునొ నేరను గొంచెమేనియుం
బ్రాభవ మొప్ప సత్కృపను బాలనసేయుమునన్ను సర్వదా
నాభవతాపవహ్నినివినాశమునొందఁగఁ జేసియో ప్రభూ!

— గురువిధానము —

ఉ. ఈగతినీవెదిక్కనుచు నెంతయుఁ బ్రార్థన సేయువానినిం
దోఁగిభవానలంబునను దుఃఖమునందెడు శిష్యునిం గృపా
భోగరసార్ద్రదృష్టిఁ గని పొందుగ ముందభయమ్మొసంగి వే
వేగఁదరింపఁజేయఁదగు వీడకసద్గురువర్యుఁడొప్పుగన్. 42

మ. అపవర్గంబుఁ దలంచువానికిని భక్త్యాసక్తిమై సర్వదా
యుపసత్తింగనునట్టివానికిని సత్యార్థాభిలాషియై తెల్పి న
ట్లుపయోగించెడువానికి స్వశమదమాద్యుచ్ఛ్రేయుఁడౌవానికి
ట్లుపదేశించెడుఁగాక సద్గురువు సద్యోముక్తికై సత్కృపన్.

— గురువచనము —

ఉ. లేదుభయంబపాయమును లేదు భవాబ్ధిఁ దరించువారికిన్
సాధనమొక్కఁడుండె బుధసత్తము! భీమభవాబ్ధి యోగులే
బోధనఁ గాంచిసద్గురుని పూజయొనర్చి తరించిరో సదా
రాధనమైనయాపథమె రంజిలనేనును నీకుఁదెల్పెదన్. 44

— సంసారతరణసరణి సనాతనము —

క. గురుతరభవ భయహరణముఁ
బరమోత్తమ మనఁగఁగల దుపాయము దానం

దరియించి తాపజలధిని
బరమానందంబు నొందఁబడియెదవుబుధా ! 45

—♦ వేదాంతవిచారణ వివేక హేతువు. ♦—

క. పరమాత్మ తత్వబోధ
స్మరణనిరంతర మొనర్ప జ్ఞానంబొదవుం
బరిహరములగును ద్వరసం
సరణమహాదుఃఖములును జ్ఞానమువలనన్. 46

—♦ శ్రద్ధాభక్తిధ్యానములు ముక్తికారణములు. ♦—

ఉ. భక్తినిశ్రద్ధయున్మతియు భవ్యసమాధిముముక్షులందునన్
ముక్తికిఁగారణంబులని మున్నె శ్రుతుల్వచియించె నెవ్వఁడీ
భక్తినిశ్రద్ధను న్మతియు భవ్యసమాధినిబూను; మోహసం
శక్తిని గల్పితంబయిున సంసృతిబంధమువాయువానికిన్.

—♦ జ్ఞానము భవనాశనము. ♦—

చ. అరయఁగ బ్రహ్మమూర్తిపగునట్టిడ నీకవివేకయోగ సం
భరణతనుత్వమున్గలిగె బంధములంగను ఘోరమైన సం
సరణ ఘటిల్లెఁ దాన సువిచారణచేఁగను బోధవహ్ని స
త్వరమునవిద్యచేఁగలుగుదాదులనెల్లదహించు వేళ్లతోన్.

—♦ శి ష్య వ చ న ము . ♦—

క. ప్రేమరసవీక్షణమ్ముల
నోముము మత్ప్రశ్నభాగ మొప్పగ వినుమో
స్వామి ! భవదుత్తరంబున
నామనివలె నేనునుంగృతార్థుఁడనగుదున్. 49

—♦ ప్రశ్న. ♦—

చ. ఒనరఁగ నేదిబంధమన నొప్పెడు? దీనికి రాకయెట్లు సం
జననముకల్గె? సత్ప్రితిభజన్మక దెట్టులు? మోక్షమెట్టులౌ?
ఘనపరమాత్ముఁడెవ్వఁడగు గాసిలుజీవుఁడెవండు? వీరిలోఁ
దనరువివేకమెద్ది?కృపఁదత్వమునంతయుఁదెల్పుమో ప్రభూ!

—♦ గురువాక్యము ♦—

క. కృతకృత్యుఁడవును ధన్యుఁడ
వతిపావితమయ్యె వంశమమరఁగఁ దత్వ
స్థితిఁదెలిసి బంధముక్తిని
మతి బ్రహ్మంబగుదుకోర్కి మనుచుటకతనన్. 51

—♦ మోక్షసిద్ధి పుత్రులవలనఁ గలుగనేరదు ♦—

క. ఋణమోచనమ్ము నొనరుపఁ
దనయులు మనుమలునుగలరు తండ్రికి; భవబం
ధనమోచనమ్ము నొనరుపఁ
దనకంటె నెవండులేడు ధరఁబరుఁడు బుధా! 52

—♦ స్వయముగ భవతాపముం బాపుకొనవలయు ♦—

క. తలమీఁద నున్నబరువునఁ
గలిగిన దుఃఖమునుబగులు కడఁద్రోచెదరాఁ
కలిబాధ యేరి వలనను
దొలఁగింపఁగఁ బడదు తాను దొలఁగింపని చోన్. 53

చ. పటుతరమైన యౌషధము పథ్యము నిత్యమునందురోగి సం
కటములఁదావిముక్తుఁడయిక్రన్న నసౌఖ్యమునొందుఁగానిత

ద్భటుఁడెవఁడేనిరోగికయిపథ్యమునౌషధమందుకొన్న చో
గటకట! సౌఖ్యముంగను నెగాసిలఁజేసెడివ్యాధిపోవునే! 54

చ. కలువలఁజేని రూపమును గాంచుటకన్యులఁ జీరకుండ ని
ర్మలమగు నైజనేత్రమున బాగుగఁగాంచినరీతి బ్రహ్మముం
జలనములేని జ్ఞానమను చక్షువుచేతనె తానెఱుంగఁగా
వలయును నెమ్మితో విబుధవర్యునిచేతనెఱుంగరాదిలన్.

క. అవివేకంబునఁ జెలఁగెడు
భవభయకామాదిపాశ బంధముఁద్రుంపన్
వివరింప నీవకాకిఁక
నెవఁడగును సమర్థుఁడిలను నెప్పటికైనన్. 56

—♦ ప్రజ్ఞానమే ముక్తి. ♦—

క. కనఁబడదు సాంఖ్యయోగం
బున విద్యను గర్మవలన మోక్షంబెపుడే
నొనగూడ దన్యవిధమున
ఘనసుజ్ఞాన ప్రబోధఁగాంచిన గలుగున్. 57

—♦ బ్రహ్మవిద్యయే మోక్షప్రదము ♦—

క. సుందరతర ఘనవీణా
సౌందర్య నినాదగీత సౌష్ఠవములెదన్
విందొసఁగుఁగాని నిత్యా
నంద విభుత్వమ్ము నొందనగునే వానిన్. 58

క. సదమలమగు వాగ్వైఖరి
పదమాధుర్యమ్ము శాస్త్రపరిచయముసు గో

విధులకు నన్నప్రదములు
బుధచంద్రమ! ముక్తిబోధములుగా వెపుడున్. 59

— తత్వవేత్తకు శాస్త్రము నిష్ఫలము. —

క. పరతత్వము దెలియమిఁదన
వరశాస్త్రాధ్యయనమెల్ల వ్యర్థంబయగుం
బరతత్వము నెఱిఁగినఁదన
వరశాస్త్రాధ్యయనమెల్ల వ్యర్థంబయగున్. 60

క. మనసు భ్రమింపఁగఁ జేసెడి
ఘనవనమా శబ్దచయము గావునఁ దత్వ
జ్ఞునివలన నాత్మతత్వము
ఘనయత్న మొనర్చి వేడ్కఁ గనుఁగొనవలయున్.

— జ్ఞానౌషధి, అజ్ఞానసర్పౌషధము. —

క. వివిధములగు నౌషధములు
జపమగు మంత్రమ్ము వేదశాస్త్రము లిలలో
నవివేకసర్పమునఁజం
పవు బ్రహ్మజ్ఞాన ఘుటికవట్టివధించున్. 62

— కేవలశబ్దోచ్చారణము ముక్తిప్రదము గాదు —

చ. ప్రవిమలమైనయౌషధముఁ బాన మొనర్పక మందునామముం
జెవిఁగొనవ్యాధిపోనటులు చిన్మయుఁగానక బ్రహ్మశబ్దముం
దవిలిజపించునంత భవతాపదవానల మారకుండు సం
భవమగుఁగర్మసంచయముబంధవిముక్తియునందకుండెడిన్.

క. కనఁబడు విశ్వమునాశన
మొనరింపక వస్తుతత్త్వమును దెలియక వా
గ్గణమాత్రఫలములగు పై
వినఁబడుశబ్దములముక్తి వెలయునెధరలోన్. 64

క. అరులనుద్రుంచక రాజ్యపు
సిరినొందక నృపతినంచుఁ జెప్పెడిమాటన్
ధర నేలు నృపతిగా భువిఁ
బరిగణనమునొంద నర్హ పడుఁడెట్టులగున్. 65

—♦ బ్రహ్మతత్త్వము కుయుక్తులవలన లభింపఁదు ♦—

ఉ. ఓపి హితోక్తిఁద్రవ్వి పయినుండు శిలాదులఁదీయునంత ని
క్షేపముగల్గుఁగా కితరచేతలఁ గల్గదుతత్త్వమట్లు బ్ర
హ్మోపదిశమ్ముచింతనము నున్నతమైనతలంపులున్నచోఁ
జేపడెడుంగుయుక్తులనుజిక్కదు మోహముదోఁగియుండుటన్.

క. కావున సకలవిధంబుల
భావజ్ఞుఁడుబంధముక్తిఁ బడయుటపొందెం
వేవిధుల వ్యాధికింబలె
జేవనుయత్నమ్ము నొనరఁ జేయగఁవలయున్. 67

క. గురుతరము శాస్త్రసమ్మత
మరయఁగ నీవిపుడు మమ్మునడిగిన ప్రశ్నం
బురవడి సూత్రప్రాయము
సరసము మోక్షార్థులకును జ్ఞాతవ్యమునా. 68

క. అవహిత చిత్తుఁడవై విను
ప్రవిమలమగు నాదువచన పద్ధతినెల్లన్
సవినయముగ వినినంతన
భవపాశమువలన ముక్తిఁబడసెదు విబుధా! 69

—మోక్షము క్రమానుగతము—

చ. మొదటఁబ్రధానకారణము ముక్తి కనిత్యపదార్థసంపదం
బొదలువిరక్తినొందుటయ పొందుగఁబిమ్మటనున్శమంబునా
పిదపదమ స్తితీక్షలటుపిమ్మట సర్వశుభాశుభమ్ములై [న్.
పొదలెడియెల్లకృత్యములబూర్తిగద్యాగమొనర్చియుంటయు

చ. పిదప సదాగమాంతమును వీనులనింపుట నాయనంతరం
బెదనుదదీయచింతనము నెక్కుడు తన్మననమ్మునొందుచోఁ
బిదపను దత్త్వపుందలఁపుఁ బిమ్మటశ్రేష్ఠసమాధినొందుచున్
బుధుడిహలోకమందుఁదగ మోక్షసుఖంబునుబొందుచుండెడిన్

క. జీవేశ్వర తత్త్వంబుల
భావ వివేకమ్ము జ్ఞేయపద్ధతి వినఁగం
గావింతు నిపుడు దీనిని
భావంబున నిలుపవలయు బాగుగ నెపుడున్. 72

—స్థూలశరీరము.—

చ. ఎముకలసారమున్మెదడు నెమ్ములు రక్తముఁద్వక్ప్వలాదిధా
తుమయము నూరుపాదతలదోర్యుగ పృష్ఠశిరఃప్రవక్షమై
యమరనుపాంగయుక్తమయి, యజ్ఞతకాకరమౌచు నేననే
భ్రమగలయీశరీరమునుబల్కిరిస్థూలపుటంచుఁబండితుల్.

—♦ భూతములు బంధకారణములు ♦—

—♦ బంధము బహుభవహేతువు ♦—

సీ. ఆకాశమును జలమగ్ని గంధవహంబు
ధరయను సూక్ష్మభూతమ్ములైదు
నన్యోన్యగుణములనంది స్థూలములయి
స్థూలశరీర హేతువులునయ్యె
శబ్దమ్మురసమును స్పర్శరూపమ్ములు
పరిమళమ్మను గుణపంచకమ్ము
తత్తద్గుణంబులై తనరుచుభోక్తకు
ననుకూలముగ సుఖమలరఁజేయు

గీ. నరయనెవ్వరు విషయమూఢాత్ములగుచు
భ్రాంతి పాశంబునంగట్టువడి చరింతు
రట్టివారలు తమకర్మ మనెడుదూత
వలన భవబంధములనీడ్వఁ బడుచునుంద్రు. 74-75

—♦ విషయబద్ధుఁడు భవమొందు టబ్బురముగాదు ♦—

శా. మత్తేభంబుకురంగమున్ ఖచరమున్ మత్స్యద్విరేఫమ్ములుం
దత్తద్వృత్తులఁజొక్కి యైదయిన శబ్దస్పర్శరూపాదులన్
మిత్తింబొందెడునైదుమానవుఁడు పేర్మిన్వానినింజొక్కనా
పత్తింగాంచుభవాదులొందుటదియబ్రంబౌనెయోజింపఁగన్

—♦ విషయములు విషమునకంటె విషములు ♦—

క. విషయ విషయముల రెంటను
విషయము దోషమ్ము సర్ప విషమునకంటెన్
విషమాను వానిఁ జంపును
విషయము కనుఁగొనినవాని వేగమచంపున్. 77

—♦ విషయశూన్యుఁడు మోక్షార్హుఁడు. ♦—

క. అతిదుస్సహవిషయాశా
పతితుఁడుగా కెవఁడు లెస్స భద్రము గనునో
యతఁ డొందు ముక్తి నన్యుఁడు
వితథుండగు వేదశాస్త్ర విదుఁడై యున్నన్. 78

—♦ తీవ్రవైరాగ్యము ముక్తిప్రదము. ♦—

చ. భవజలధిం దరింతుమను భావముతోడ విరాగులై ముము
క్షువులు జెలంగ నాశయన క్షుద్రపుగ్రాహము పొంచికంఠమున్
జవమునవట్టి పోఁజెరచి చయ్యనలాగి మునుంగఁజేయుఁదా
వివిధవిధంబులం గరపి కెంగలిబుద్ధిని నంతరంబునన్. 79

క. విరతియను ఖడ్గధారం
గరమున విషయగ్రహమ్ము ఖండించు నతం
డురవడి విఘ్నచ్యుతుఁడై
తిరముగ సంసారజలధి తీరముఁ జేరున్. 80

—♦ విషయలంపటత మృత్యుపదము. ♦—

క. అతివిషమ విషయపథమున
మతిలేక చరింప విషయమత్తత యెపుడుం
బ్రతిపదము నంటి వచ్చెడు
మృతిసంభవ మగున టంచు నెద నెఱుఁగఁదగున్. 81½

—♦ యుక్తిహితోక్తులుహిత మొసంగును. ♦—

క. అతివిషమ విషయపథమున
హితసుజనగురూక్తి యుక్తి నెంచి చరింపన్

హితమైన ఫలము చేకురు
సతతము బుతమిది యటంచుఁ జక్కఁ నెఱుఁగుమా. 82

—♦ ముముక్షు విధి ♦—

ఉ. వారకము క్తినొందమది వాంఛజనించిన నింద్రియార్థముల్
దూరము సేయుదుర్విషముతోడసమానములౌట నెంచుచున్
ధారణసల్పుకౌతుకము దాంతిని శాంతిని నార్జవమ్మునుం
గూరిమినోరిమిన్ సుధను గూర్చెదు కైవడినాదరమ్మునన్.

—♦ దేహాభిమానికి మృత్యువగితి ♦—

చ. అవమతిము క్తిమార్గమునునారయకెవ్వఁడనుక్షణంబుఁదాఁ
దవిలిపరార్థమైన తనుధర్మము నెంచక చందనాది వ
స్తువులనుభోగ భాగ్యములతోఁదనువుందగఁ బెంచుచుండునో
భువినతఁడాప్రమోహమునుబొందుటనాత్మనుజంపువాఁడగున్.

క. తనుపోషణమ్ముఁ గోరుచు
ననుదినమ్మెవఁడాత్మతత్వ మరయఁదలఁచునో
పెనుమొసలి దారువనుమతిఁ
గని నది దాఁటంగనెక్కు కైవడినతఁడౌ. 85

—♦ మోహరహితుఁడు ముక్తుఁడు ♦—

క. దేహాది వస్తుసంతతి
మోహము మృతియగుటవలన మోక్షార్థి సదా
మోహ వినిర్జితుఁడై చన
"సోహం" బను బ్రహ్మపదముఁ జూడఁగఁగల్గున్. 86

—♦ మోహము మృత్యువు ♦—

క. మనుజుల్ద్ది జయము నొందుట
ఘనమగు వైకుంఠపదముఁ గనుఁగొనిరొ తగం
బెను మృత్యు వట్టి మోహము
వనితాసుత దేహతతులఁ బాయఁగవలయున్. 87

—♦ స్థూలము నింద్యము ♦—

గీ. రుధిరమాంసాస్థి నరచర్మరోమపజ్జ్జ
దూషితంబయి మూత్రపురీష మిళిత
మైన స్థూలము దేహంబునై చెలంగ
ధరణి నతిహేయమై దూషితమ్మగుచును. 88

—♦ జాగ్రత్తు సుఖ దుఃఖ మిళితము ♦—

క. పంచీకృత భూతమ్ముల
నెంచఁగ ప్రాక్కర్మస్థూలమేర్పడి తనకున్
సంచితమున భోగ్యమ్మగు
నంచితముగ జాగరూకతావస్థ నిలన్. 89

—♦ స్థూలమునకు జాగ్రత్తు ముఖ్యము ♦—

ఉ. మాలలు, మంచిగంధము సమంచితరత్న సతీధనాది వి
స్థూలపదార్థభోగమును జొక్కుచు లోచనపాళి జీవుఁడా
లీల నహంకృతిం దగ శరీరము తానను బుద్ధినొందుటన్
స్థూలమునం బ్రశస్తముగఁ దోఁచెడుజాగ్రదవస్థ సర్వదా. 90

—♦ ఆత్మ స్థూలాతిరిక్తము ♦—

క. సకలప్రపంచమింద్రి య
నికరాశ్రయమైన దగుట నెరిసూలంబా

త్మకు గృహము గేస్తునకు వలె;

సకలవిధంబులను వేఱుసంతతము బుధా! 91

—♦ నామగోత్రాదులు స్థూలధర్మములు ♦—

చ. జననము, వృద్ధి, సంక్షయము, శైశవయావనవృద్ధతాంశలున్
ఘనతలఘుత్వభేదములు, గౌరవభోగ పరాభవమ్ములున్
మనియెడునాశ్రమంబులు, సముంచితగోత్రకులాదులున్నదా
తనువునఁగల్గురోగములు ధారుణిసన్నియు దేహధర్మముల్.

—♦ జ్ఞానేంద్రియ పంచకము ♦—

క. ఘ్రాణముఁ, జర్మము, నాలుక,
వీనులు, గన్నులును నైదు విషయములందున్
జ్ఞానము నొందుటఁ గ్రమమున
జ్ఞానేంద్రియ పంచకంబుగా నలరారున్. 93

—♦ కర్మేంద్రియములు ♦—

క. పాణియ్యు బాదము వాక్కు న
పానముగూఢేంద్రియమ్ము వరుసగఁ బనులం
బూని చరించుటచే నీ
మేనును గర్మేంద్రియమ్ము లిమ్మగ విబుధా! 94

—♦ అంతఃకరణ చతుష్టయ వివరము ♦—

చ. స్థిరముగ నంతరింద్రియము చిత్తము బుద్ధియు మానసంబహం
కరణమనన్ స్వవృత్తులను గ్రాలు; మనస్సు వికల్పకల్పనా
పరిణతిసుమ్ము; వస్తునిజభావము బుద్ధి, శరీరమందునన్
గరువమహమ్ము; స్వార్థమునఁ గ్రాలెడిశీలము చిత్తమౌ తగున్.

— వాయుపంచకము. —

క. ప్రాణానిలమొకఁడైనను
వ్యానాపానములుమఱియుఁ బ్రాణసమానో
దానములగు క్రియ భిన్నముఁ
బూనుట భూషలనుగనక పున్నిటివలెఁ. 96

— సూక్ష్మ (లింగ) శరీరము, —

క. జ్ఞానసుకర్మేంద్రియములుఁ
బ్రాణంబులు వలపుఁబనులుఁ బంచాభ్రాదుల్
మానసముఁ జిత్తబుద్ధ్యభి
మానాజ్ఞానములు సెల్లు మహి సూక్ష్మమనన్. 97

ఉ. ప్రాకృతజన్మవాసనలఁ బాయకకూడి కడంకమై యపం
చీకృతభూతపంచకముచే జననంబునుగాంచి పుణ్యముల్
ప్రాకటదుష్క్రియల్గుడువఁ బొల్పడియాత్మకనాద్యుపాధిగం
బ్రాకృతబుద్ధిఁగ్రాలెడి పురాష్టకమొప్పెడు లింగదేహమై.

— బుద్ధిస్వప్నమఁమను వికసించును. —

చ. కలనఖిలేంద్రియమ్ములువికాసమునొందకయున్నబుద్ధి తా
మెలఁకువ నెన్ని యోపనల మేకొనిచేయు విశేషమై సదా
చెలఁగుటచేతఁగానఁగలచెన్నగసూక్ష్మముకున్విభాగముం
గలుగఁగఁజేయునట్టి దశగానగు జాగ్రదవస్థ నన్యమై. 99

— ఆత్మ కర్మబద్ధముగాదు —

మ. కలనీజీవుఁడు కర్తృతాదిగతుఁడై కాంతిల్లినంగాక ని
ర్మలుఁడై వృత్తులులేకయుండినను ధీమాత్రంబుగా సాక్షియై

యలరందతత్కృతకర్మ లేశముల నావంతేనిఁ దానంటకన్
వెలుఁగు న్సంగవిహీనుఁడౌటను భువి న్వేడ్కన్బుధా సర్వదా.

—♦ సూక్ష్మదేహ మాత్మసాధనము. ♦—

క. ఈ సూక్ష్మము జీవునకుం
జేసెడి సాధనము సుమ్ము క్షితివాస్యాది
వ్యాసము వర్ధకికినివలె
నీసామెత నాత్మ సంగహీనంబ యగున్. 101

—♦ వికలాంగ మింద్రియధర్మము. ♦—

చ. సుగుణతదుర్గుణత్వములఁ జూపునగ్రుడ్డికొంతచూపు సొం
పగునవలోకనమ్మెటునయమ్మనఁ బొల్పడు నావిధంబుగం
దగబధిరమ్మమూకయనుధర్మములున్ శ్రవణాదిధర్మముల్
సొగసుగ నాత్మకెప్పుడును జొప్పడకుండెడుసాక్షియౌటచేన్.

—♦ కర్మేంద్రియ ధర్మములు. ♦—

శా. ఓలిన్ స్వేదక్షుత్తుద్విజృంభణములందుచ్ఛ్వాసనిశ్వాసలున్
వాలాయంబుగఁ బ్రాణపంచకమునన్వర్తించు కృత్యమ్ములై
క్రాలుంబొందుగ క్షుత్పిపాసలిల వీకం బ్రాణధర్మంబు లీ
వీలుం బండితులెంచి తెల్పిరని వేవేడ్కన్మదిన్నమ్ముమా.

—♦ అంతఃకరణ మాభాసమాత్రము. ♦—

క. ఈ యవయవదశకంబునఁ
గాయమ్మున నహమటన్న గరువముతోడన్
వేయిగ నంతఃకరణము
ఛాయాతేజమును గనుచు సంతత ముండున్. 104

—♦ అహంకార మవస్థాత్రయపూరితము ♦—

క. నేనభిమానిని గర్తను
నేనానరఁగ భోక్త ననెడి నెరి గర్వముఁ దా
మానుగ సత్త్వత్రయ సం
ధానమునన్ జాగ్రదాది దశలొందు మదిన్. 105

—♦ ఆత్మ సుఖదుఃఖశూన్యమైనది ♦—

క. తగవిషయము లొనరిన సుఖ
మగుఁ బ్రతికూలమున దుఃఖ మగు ధరణిని నా
దగ మంతఃకరణము సా
క్ష్మగు నాత్మకు లేవు సాక్షియగుటను విబుధా! 106

—♦ ఆత్మ ప్రియతమము ♦—

క. స్వయముగ విషయము లెయ్యెడఁ
బ్రియమై చన వాత్మకొఱకుఁ బ్రియమగుఁ గాన
న్నయ మొప్ప నాత్మ యన్నిట
స్వయముగఁ బ్రియతమమటంచు వాక్రువ్వఁదగున్. 107

—♦ ఆత్మ నిత్యానంద మనుటకుఁ బ్రమాణము ♦—

ఉ. పొందుగ నిద్ర నేపనుల బోకడ నేరని నిత్యసౌఖ్యమా
నందమునొందుచున్కిఁ గనినన్వగనొందదొకప్పుడాత్మ మే
లందెడునంచు దెల్పుటకునాగమయుక్త్యనుభూతులుంగ్రమం
బందుఁ బరంపరానుగతమైనవివాదములుంబ్రమాణముల్.

—♦ ఈశ్వరశక్తి ప్రపంచకారణము. కారణశరీరము ♦—

క. త్రిగుణాన్విత ముత్కృష్టము
నగు నవ్యక్తాఖ్యయా సదాత్మబలంబే

యగు నజ్ఞానము మాయయు
నగు సర్వజగమ్ముఁ బుట్టువగు శక్తియనన్. 109

—♦ మాయాస్వరూపము ♦—

గీ. కా దసత్తును సత్తునుగాదు భయము
కా దభిన్నము భిన్నముగాదు భయము
గా దనంగము నంగముగాదు భయము
నగు ననిర్వచనాద్భుత మగుచు మాయ. 110

—♦ బ్రహ్మజ్ఞానము మాయను నశింపజేయును ♦—

చ. ఇదియొక త్రాఁడుసుమ్మనుచు నెంచనహిభ్రమవోవునట్లునె
మ్మదిఁ బరిపూర్ణశుద్ధపరమాత్మవివేకము గల్గునంతటన్
వ్యథఁగొనిమాయసత్వరమపాయునుసత్త్వరజస్తమంబులున్
విదితములౌనుకృత్యముల వేడ్కనిసర్గముతోచుమాయకున్

—♦ రాజసము బంధమూలము ♦—

గీ. కార్యరూప పురాతన గమనములను
జెందు రాజసగుణము విక్షేపశక్తి
యందు మానస వికృతము లగుచుఁ గ్రాలు
విషయదుఃఖాదు లెప్పుడు వెలయుచుండు. 112

గీ. కోర్కియును గోపమును లోభగుణము దంభ
మీసు గర్వము మదమును నివియునెల్ల
రాజసమ్ములు ప్రవృత్తి రాజసమ్మ
గాన నిది బంధమూలమై గ్రాలుచుండు. 113

—♦ ఆవరణ పదార్థభేదముఁ గలది ♦—

గీ. బ్రహ్మవస్తువు నన్యరూపముగఁ దెలియఁ
గరపుచుండుఁ దమోగుణావరణశక్తి
పురుషసంసారహేతువై పరగు నింక
నెంచ విక్షేపశక్తికి నిదు బలమ్ము. 114

సీ. మేధావియైనను మేటి పండితుఁడైన
నత్యంత సూక్ష్మమా నాత్మనరయు
జ్ఞానియైనను మహాశక్తిమంతుఁడైన
హితజన ప్రోద్బలయుతుఁడు నైనఁ
దమము నావరణముఁ దగిలి చిత్తంబున
నిజమగువస్తువు నెఱుఁగలేఁడు
భ్రమను గల్పింపఁగఁబడు వస్తువును లెస్సఁ
దలఁచు సత్యంబని తద్గుణములఁ

గీ. బట్టి వ్రేలాడుఁ గటకటా! ప్రబలమైన
ఘోరతామస మనియెడు గుణమునంటి
యున్న యావృతశక్తిని నెన్నఁదరమె
మహి మహత్తరమగుచును రహిఁ జెలంగు. 115

గీ. అనుచితంబగు భావన యన్యచింత
సంశయమ్ము నవిశ్వాస సరణియుఁ దగ
నావృతింగను పురుషుని పో విడువవు
చలనమొందించు విక్షేపశక్తి యెపుడు. 116

గీ. మూఢతాలస్యములు మందమును సుషుప్తి
జడత పొరపాటు లివి తమోజన్యములగుఁ

దామసాత్మకుఁ డొక్కింత తానెఱుఁగఁడు
నిద్దురింజెందు నరుగతిఁ మొద్దువలెను. 117

—♦ సత్త్వచైతన్య ధర్మము. ♦—

చ. జలము వలె న్విశుద్ధమగు సత్త్వము రాజసతామసంబులం
గలియుచు భీమసంసరణఁ గల్పనఁ జేయును సత్త్వమందు ని
ర్మలమగు నాత్మబింబమయి మానుగ నీయఖిలమ్ము నర్యము
న్వలెఁ దనకాంతిపుంజముల భాసిలఁ జేయుచునుండు మెండుగన్

—♦ మిశ్రసత్త్వ ధర్మములు. ♦—

క. యమ నియమ శ్రద్ధాఽగ
ర్వములును సద్భక్తి దైవభాగ్య మనన్యా
శము ముక్తికాంక్షయును ని
శ్రమసత్త్వగుణంబులగుచుఁ గ్రాలుచు నుండున్. 119

—♦ విశుద్ధసత్త్వ గుణములు. ♦—

ఉ. సంతతచిత్తశుద్ధియును స్వాత్మవివేకవిశేషము న్మహా
శాంతముఁ దృప్తిఁ బొందుటయు సంతసముం గరుణావిశేషమ
త్యంతసుఖానుభూతి నవయంబు నొసంగెడు బ్రహ్మనిష్ఠ యే
భ్రాంతియులేక యుండుటయు బాగుగ శుద్ధసుసత్త్వధర్మముల్.

—♦ సుషుప్తిభిన్నావస్థ ♦—

క. ఈ సత్త్వత్రయమున సం
కాశంబగు నట్టిమాయ కారణము సదా
భాసిల్ల కన్నివృత్తులుఁ
బాసినయానిద్ర దీనిభాగపు దశమా. 121

ఉ. వీక మనఃప్రవృత్తులను వీడుచు నింద్రియజాలమెల్ల నే
పోకడఁ బోవనీయక ప్రపూర్ణలయంబొనరించి బీజపుం
బోకడ బుద్ధి నిశ్చలతఁబొందఁ సుషుప్తి ధరిత్రి నిద్రను
న్నా కెవిగుర్తులేవని యనంగను గారణలక్షణంబగుఁ. 122

—♦ జగన్మిథ్య. ♦—

సీ. జ్ఞానకర్మేంద్రియ కాండమున్ దేహమ్మున్
ప్రాణపంచకమును మానసమ్మున్
జిత్తమహంకారవృత్తియు బుద్ధియు
శబ్దాదులును దుఃఖసౌఖ్యములును
భోజనాద్ములు కామభోగవికారముల్
వ్యోమాదులగు పంచభూతములును
నవ్యక్తపర్యంతమగు విశ్వమెల్లన
తథ్యమౌట ననాత్మతత్త్వమగుడు
గీ. నవని మహదాది దేహపర్యంత మెల్ల
మాయచేఁ గల్పితంబని మాయయనియు
నెండమావులవలెఁ దోఁచుచుండు ననియు
నస దనాత్మకములనియు నరయుమావు. 123-124

—♦ పరమాత్మ తత్త్వము. ♦—

క. నరుఁడెద్ది తెలిసి బంధపు
టురులను దెగఁగోసి మోక్ష మొందఁగలఁడో యా
పరమాత్మ రూపమును నీ
వరయఁగ వచియింతు నెట్టియనుమాన లేకను. 125

గీ. పంచకోశమ్ములకుఁ జూడమించి జాగ్ర
దాద్యవస్థలఁ గనుచును నహరహమ్ము
నహమునకు సాక్షియై క్రాలి యఖిల మతేఁడ
యగుచు వెల్గెడు నొకపరమాత్మ గలదు. 126

గీ. సకల జగమును మూఁడవస్థల నెఱింగి
బుద్ధి సద్భావివృత్తుల పోకయునికి
నెఱిఁగి నేనను కీర్తికి నింపెసంగు
నదియ పరమాత్మ తత్వమై యలరుచుండు. 127

క. సకలజగంబును దాఁగని
సకలముచే నెఱుఁగఁబడక సకలాసువులున్
వికసింపనెఱిఁగి తనకసు
వొకటనుగనకుండు నాత్మయున్నతి మీఱన్. 128

క. తా నయి సకలము వెలుఁగుచుఁ
దా నెవ్వని వ్యాప్తిఁగనఁడు తనసీడ వలెన్
జానగు విశ్వముఁ దనగతి
నూనుచు వెలుఁగొందుఁ దాను నొప్పెసలారన్. 129

—♦ ఇంద్రియము లాత్మశక్తివిలసనములు. ♦—

క. పరమాత్మశక్తి నంతః
కరణము నింద్రియచయమ్ముఁగాయమ్ము మహా
త్పరివర్తనమ్ము నొందెడుఁ
జొరబడి తమపనులయందు సొంపుగ నెపుడున్. 130

—♦ ఆత్మ సర్వజ్ఞత గలది. ♦—

క. తెలియు నహంకారాదులఁ
దెలియును దేహేంద్రియములఁ దెలియు సుఖములం
దెలియును విషయములను దగఁ
గలశమువలెఁ దాఁ జిదాత్మ జ్ఞానమయతచేఁ. 131

గీ. ఇంద్రియప్రాణములఁ జరియింపఁజేయు
నంతరాత్మ చిదాభాసుఁ డనవరత సు
ఖానుభూతి పురాణుఁడు జ్ఞానమయుఁడు
నేకరూపుండునై వెల్గుఁ బ్రాకటముగ. 132

క. ఈకాయమందు మతి న
ప్రాకృతనభమందు నిజవికాసము మీఱఁ
లోకము వెలుఁగఁగఁ జేయుచు
నాకసమున సూర్యువలెఁ జిదాత్మవెలుంగుఁ. 133

—♦ ఆత్మ నిర్వికారమైనది. ♦—

క. చిత్తాహంకారమ్ముల
వృత్తుల దేహేంద్రియాదివికృతులఁ గనుచుం
బొత్తొంది చేష్టలొందదు
హత్తదయోనలమువలెను నాత్మయొకపుడున్. 134

—♦ ఆత్మ శాశ్వతము. ♦—

క. చావదు పుట్టదు కొఱవడ
దే వికృతిని గొనదు వృద్ధి నెనయదు ఘటమం
దావిర్భవించు గగనము
చేవ శరీరమ్ము డుల్ల స్థిర మాత్మయగున్. 135

—♦ పరమాత్మ మాయావికారభిన్నము ♦—

ఉ. మాయను దద్వికారముల మానుగ భిన్నమునై విశుద్ధబో
ధాయతనమ్మునైనపరమాత్మక్రియాగుణశూన్యమౌచు నీ
హేయజగంబునంతయురహింపఁగఁజేయుచుజాగ్రదాదులన్
హాయిగబుద్ధిసాక్షియయియన్నిటవెల్గునునేను నేనరన్. 136

—♦ ఆత్మజ్ఞాని కృతార్థుఁడు ♦—

చ. నియమితమైన చిత్తమున నీవు త్వదాత్మను శుద్ధబుద్ధమై
నయ మహా మంచునెంచి జననాంతతరంగ చలద్భవాబ్ధిని
ర్భయముగ దాఁటు;సంతతముబ్రహ్మమయత్వమునంజరించుని
శ్చయముగ సార్థకంబగుదుజన్మము;ధన్యుఁడ వౌదువంతటన్

—♦ తనదేహమే తనకు బంధము ♦—

సీ. ఈ యనాత్మపదార్థ మెంచక నేనను
మతి కర్మబంధమై సతత మొప్పు
జననమృతిక్లేశచయ మొనగూర్చు నీ
బంధ మజ్ఞానసంప్రాప్తమయ్యె
నీబంధమున మూఢుఁ డీనశించు శరీర
మునుగాంచి నేనను బుద్ధి నొనర
భోజనాదులచేతఁ బోషించుకొనుచును
నభ్యంగనాదుల నందమలర

గీ. దారములనల్లి గూటిని జేరి సాలె
పురువు రక్షించుకొనునట్లు స్థిరమని మది
ననవు గల్గెడు విషయమ్ము లనుభవించి
బహువిధంబుల రక్షణపరచు చుండె. 138-139

—♦ నేనను నభిమానమే బంధము ♦—

సీ. అదికానివస్తువం దదియను తలపోఁత
మూఢున కవివేకమునఁ జెలంగు
నాశీవిషమునందుఁ బాశమ్మనెడు బుద్ధి
జ్ఞానహీనతచేత సంభవించుఁ
దన్మూలమున సమాదాతమిక్కుటమైన
కష్టపరంపరల్ గాంచు చుండు
దాన నసత్తును నేనని తలఁచుట
సఖుఁడ బంధంబనఁ జనును వినుము

గీ. ధరను దామసరూపమావరణశక్తి
ఖండములు గాఁగ స్థిరమయి రెండు గాక
జ్ఞానమున వెల్గునాత్మను సరగఁ గవియుఁ
గడఁగి రాహువు రవిబింబ మొడియునట్లు. 140-141

—♦ ఆవరణశక్తివలన విక్షేపము విజృంభించును. ♦—

సీ. నిర్మలరుచులతో నెరివెల్గు తనయాత్మే
యావృతశక్తితోఁ నణఁగియుండఁ
బురుషుండనాత్మయై పరగెడి దేహమ్ము
నజ్ఞానవశత నేననుచు నమ్మ
వేడ్క నద్దానిచే విక్షేపమను రజో
గుణయుక్తమైనట్టి గొప్పశక్తి
కామాదిషడ్వర్గ ఘనబంధగుణముల
నిమ్మాధు గలఁచెడు నెంతయు భువిఁ

గీ. కుమతి నీతఁడు చెడుస్రోవం గ్రుమ్మరుటను
మోహమకరనిబద్ధుఁడై ముద్వివేక
శూన్యుఁడై తద్గుణంబులఁ జొచ్చు కతన
బుద్ధ్యవస్థల నెల్లను బొందుచుండి. 142½

క. విషయమ్ము లనెడి గురుతర
విషపూరిత మనధిగమ్య వేలము భవము
న్విషనిధిఁ దేలుచు మునుఁగుచు
విషమగతిం దిరుగుచుండు వెంగలి యగుచున్. 143

—♦ అహంకార విజృంభణము ♦—

క. ఏరీతి భానురుగ్భవ
వారిద మొగిభానుఁగప్పి వ్యాప్తింగనునో
యారీతి నాత్మజాహం
కారం బెపుడాత్మఁగప్పి గ్రాలుచు నుండున్. 144

—♦ విక్షేపము బహువిధ బాధాకరము ♦—

మ. ఘనమౌదుర్దినమందు భాస్కరుఁడు మేఘాచ్ఛాదితుండై చనం
బెను సత్రింగని భీమమారుతమెటుల్ పీడించునో మబ్బులన్
జనితభ్రాంతిని నాత్మ కప్పువడ నజ్ఞానాత్ము నారీతిఁ గ
స్తిని దానెప్పుడుఁ గల్గఁజేయునిలవిక్షేపంబు తీవ్రంబుగన్.

—♦ విక్షేపావరణములు బంధములు ♦—

క. ఏ శక్తుల నీజీవుం
డాశను గొని తనవు నాత్మయని తలఁచెడి నో
యాశక్తులె పురుషున కవ
కాశంబిడు బంధమందుఁ గట్టువడంగన్. 146

—♦ జీవుఁడు పక్షిసదృశుఁడు ♦—

సీ. సంసారమను మహాశాఖి కజ్ఞానంబు
విత్తనంబగుచును వెలయుఁ దనువు
నాత్మఁగాఁ దలఁచుట యంకురంబగుఁ గోర్కి
చివురు కర్మచయము క్షీరమలరు
నంగమ్ము స్కంధము నసువులెల్లను గొమ్మ
లింద్రియమ్ములు కొన లిలగుణములు
పూవులు బహుకర్మ పుంజసంభవమగు
దుఃఖము ఫలమయి తోఁచుచుండు

గీ. నిమ్మహీరుహమందున నింపుమీఱ
ఖేచరము భాతిజీవుఁడు క్రీడలొంది
భోక్త యగుచును సంతతాసక్తి నలరి
కర్మబంధంబులను గడుఁ గలఁత వడును. 147

—♦ బంధము మోక్షప్రదము ♦—

క. అవివేక మూలమగుచును
భువి వెలయునవాత్మబంధపుంజము నైజం
బవధినిహీనమునై పుం
గవునకు భవమరణరోగకరమై క్రాలున్. 148

—♦ కర్మము జ్ఞానమున నశించును ♦—

క. తెగఁబడ దనాత్మబంధము
తగ ననిలానలశరాసిదళ శస్త్రములన్
సుగమపుఁ గర్మలఁ దెగఁబడు
భగవత్కృప జ్ఞానమనెడి పటుఖడ్గమునన్. 149

—♦ బ్రహ్మసాక్షాత్కారము బంధనాశము ♦—

గీ. నిగమ విశ్వాసి తనధర్మ నియతిఁ గనును
ధర్మనియతిని జిత్తము నిర్మలమగు
బుద్ధి శుచినొందఁ బరమాత్మ బోధగల్గు
నాత్మబోధను సంసృతి యంతమొందు. 150

—♦ ఆత్మ యావరణచేఁ బ్రకాశింపదు ♦—

ఉ. ఎన్నఁగ నాత్మశక్తి నుదయించిన నన్నమయాదులై దిటం
బ్రన్నన నాత్మ కప్పువడి కాంతిలకుండెడు నాచుపోఁగులం
బన్నగ నావరింపఁబడి బావిని నుండుజలంబు నిత్యమే
తెన్నను గాన కున్కిఁ దన దీధితి నోడుచు నుండునట్లుగన్.

—♦ ఆత్మ ఆవరణఁ బాసిన విజృంభించును ♦—

క. తను నాచుపాసి చనఁ గను
వన మతినిర్మలత నొంది బడలికఁ దృష్ణం
జనఁ బుచ్చి తెప్ప పురుషున
కొనరఁగ రక్షణము సుఖముఁ గూర్చు విధమునన్. 152

గీ. పంచకోశమ్ము లావృతిఁ బాసి చనఁగ
నాత్మ సంతత సంతసమంది శుద్ధ
మగుచుఁ గూటస్థమయి కడునలరి చెలఁగి
కాంతి నొందు స్వయంబుగ ఘనతమీఱ. 153

—♦ జ్ఞాని యానందమయుఁడు ♦—

క. నిత్యానిత్య వివేకము
ప్రత్యహము గొనెడు బుధుఁడు బంధచ్యుతుఁడై

నిత్యానందం బొసఁగెడు
సత్యముఁగని సంతసమున. శాంతమయుఁడగున్. 154

—♦ బ్రహ్మనిష్ఠుఁడు ముక్తుఁడు ♦—

చ. కసవున గడ్డిపోచవలెఁ గన్పడు నట్టి జడప్రపంచమున్
బొసగకనిష్క్రియుండగుచుఁబొంచుచువేఱయితానమించియిం
పెసఁగసనాత్మనాత్మనలయించుచునాపరమాత్మరూపమున్
వెసఁగనుచుండువాఁడుకడువేడ్కవిముక్తినిబొందువాఁడగున్.

—♦ అన్నమయకోశ మాత్మకాదు ♦—

ఉ. అన్నరసంబుచేభవము నంది పురీష నరాస్థిరక్తసం
పన్నము మాంసచర్మ పరిభాసితమై తగు దేహమేబుధా!
యన్నమయంపు కోశమది యన్నము నంగను జీవనమ్ముత
ద్భిన్నమునన్నశించునిలబిట్టుగఁగాదిదియాత్మయెన్నఁడున్.

—♦ దేహ మాత్మగాదు ♦—

గీ. జననమరణంబులకు మధ్యసంభవమయి
క్షణగుణంబయి భిన్నమేక్షణమును గని
ఘటము పోలిక నందు నీఘటమదెప్పు
డన్నిటికి సాక్షియగునట్టి యాత్మగాదు. 157

క. కరచరణాదుల దేహము
గొఱవడినం బ్రతికి బలము కొఱవడ కున్కిం
బరమాత్మకాదు నియమిత
మరయ నియామకుఁడదెట్టులయ్యెడు ధరణిన్. 158

—♦ దేహమునకన్న నాత్మభిన్నము ♦—

క. తనువునకు ధర్మములకును
దనక్రియలకుఁ దత్తదంశ తత్వాదులకున్
ఘనసాక్షియైన యాత్మకుఁ
దనువున వేఱగుట తనకుఁ దా సిద్ధమగున్. 159

క. మలపూర్ణ మస్థిరాశియుఁ
బలలవిలిప్తమ్మ మలిన భాజనమగు నీ
ఖలదేహ మీగుణమ్ముల
నలరని పరమాత్మ యెట్టు లగుచుండుబుధా! 160

—♦ ఆత్మతత్వము జ్ఞానికే యెఱుక ♦—

గీ. మాంస మెముకలు మెదడును మలము తోలుఁ
గల శరీరము తానుగాఁ దలఁచు కుమతి
జ్ఞాని పరమార్థమగు తనుకాయమునకు
భిన్నమగు వానిగా మదినెన్నుచుండు. 161

—♦ జ్ఞాని పరబ్రహ్మను తానని తలంచు. ♦—

గీ. అజ్ఞుఁ డెప్పుడు తనువు నేననుచుఁ దలఁచు
దేహి దేహమ్మ లేనని తెలియు బుధుఁడు
వస్తుతత్వవివేకియౌ ప్రాజ్ఞుఁడరయ
నంత మొందని బ్రహ్మఁ దాననుఁచు దెలియు. 162

ఉ. తోలును మాంసము న్మెదడు దుమ్ములు మూత్రమలాదియు
క్తమై క్రాలెడి నీశరీరమును గాంచుచు నేననఁబోకుమూఢ!
స । చ్ఛీలవికార శీలములఁ జెందక శాశ్వతసత్స్వరూపమై

యోళి వెలుంగు నాత్మఁగని యొప్పఁగ నేనని సౌఖ్య
మొందుమా ! 163

—◆ అవివేక పండితునకు ముక్తిలేదు. ◆—

ఉ. ఎంచఁగఁ బ్రాజ్ఞుఁడై తనరి యీతఁడు వేదనయాంతదర్శియై
మించెడుఁగాక నాత్మయగు మేనున భ్రాంతి నహమ్మటంచు దా
నెంచెడు నంతకాలమును నేగతినైనను మోక్షవార్త సి
ద్ధించదు కొంచెమేనియు సుధీవర! యీతని కెట్టి పుట్టువుల్.

—◆ స్థూల మాత్మకాదు ◆—

ఉ. కాయపునీడ స్వప్నపరికల్పిత దేహమునందు దర్పణ
చ్ఛాయనుగాంచి నేనని వెసన్నది నెంచనిసంచునబుద్ధి నెంతయుం
బాయక నేను నాదనెడు భావముఁ బూనకు ప్రాణవాయుసం
ధాయకమైన స్థూలమునఁ దత్త్వమెఱుంగక కొంచెమేనియున్.

—◆ దేహాత్మబుద్ధి విడిచిన జన్మయుండదు ◆—

క. నరులొందెడి జననాదుల
కరయఁగ దేహాత్మబుద్ధియగు కారణ మీ
ధర నద్దానిని విడువుము
మరల భవము గలుగునట్టి మనుగడ దుల్లున్. 166

—◆ ప్రాణమయ మన్నమయమును ప్రేరేచును ◆—

ఉ. పాణియువాక్కుఁ బాదములుపస్థయుఁ బాయువునైదుఁ గూడనీ
ఘ్రాణము ప్రాణకోశమయి ప్రాపయి యన్నమయప్రకోశముం
బ్రాణిగఁ దానొనర్చుచును వైదికలౌకికసర్వకార్యసం
ధానమునందు సంతతముఁ దప్పక వర్తిలఁజేయుచుండెడిన్.

—♦ ప్రాణకోశ మాత్మ కాదు ♦—

చ. బయటను లోనఁ దాఁ దిరుగు వాయువు పోలికఁ గొంచె మేనియు
న్నయమును దుర్నయమ్మును వినాశము గాని యెఱుంగ దొక్క చో
స్వయమును నన్యముం గనఁగఁ జాలదు నిత్యము పారతంత్ర్యరూ
పయి వెలుఁగొందఁ గాదెపుడు నాత్మ స్థిరంబుగఁ బ్రాణమిద్ధరన్.

—♦ ప్రాణమయకోశపూర్ణత మనోమయము వెలుంగును ♦—

ఉ. ఘ్రాణము జిహ్వ శ్రోత్రమును గాత్రము నేత్రము నైమఁ జిత్తసం
ధానమునన్ మనోమయము దానయి వస్తువికల్ప హేతువుం
బూని విభేద సంజ్ఞలను బొందుచుఁ బ్రాణమయ ప్రకోశమున్
జానుగ నింపు మీఱి కడుఁ శక్తిని వెల్గుచునుండు నెప్పుడున్.

—♦ మనోవిజృంభణము సంసృతికారణము. ♦—

క. జ్ఞానేంద్రియ హోతలు పెం
పూనఁగ విషయాజ్యధారఁ బొందింపంగన్
నానాకర్మేంధనములఁ
దా నెద్దిగి మనోమయాగ్ని దాల్చు జగంబున్. 170

చ. మనసునకన్న భిన్నమగు మాయగనంబడ దెంచి చూచినన్
మనసె ప్రపంచహేతువగు మాయ, మనస్సు వినాశ మొందినం
గను సకలమ్ము నాశమును గాక విజృంభణవృత్తి నొందినన్
జననము నొందు సర్వమును సంసృతిబంధము నొందిరెక్కొనన్.

ఉ. వస్తువు శూన్యమై తనరు స్వప్నమునన్ మనమా స్వశక్తిచే
వస్తుగణంబు నందను భవాత్మక విశ్వముగూర్చు రీతి న
వ్యస్తత గాంచి నీ మనము వారక యీ సకల ప్రపంచ వి
న్యస్తము సేయు మిక్కుటము నందదు జాగ్రదవస్థ నెంతయున్.

క. కలఁ మనసు లయము నొందినఁ
గలుగ దొకింతయు జగంబుగావునఁ బురుషుం
జెలఁగెడి సంసృతి చిత్తము
వలనన కల్పితము లేదువాస్తవముగనన్. 173

క. వాయువునఁ బుట్టు మబ్బా
వాయువుచే మరలఁ గలఁతవడియెడు గతి గాఁ
బాయక తోఁచెడు బంధము
బాయును స్వాంతమ్ము వలన బంధము మరలన్. 174

ఉ. ఆశఁ జనింపఁజేసి విషయమ్ముల మున్నుగఁ జిత్తమంత నా
యాశను ద్రాటజంతువు నయమ్మున బంధమొనర్చి వేగమే
యీసకలమ్మునందుఁ గడుహేయము గ్రన్ననఁబుట్టఁజేయుచుం
బాశవిముక్తుఁ జేయు నిలబాగుగఁ బూరుషుబంధమూడ్చుచున్.

ఉ. కావున బంధమోక్షములు గల్గుట కీతనికి న్మనంబ సం
భావుకమైన కారణము బంధముఁ గూర్చు రజోగుణమ్మునం
దావిమలత్వ మొందమిని దామసరాజసము ల్నశించుచో
వేవిమలమ్ము నొంది మది వేడ్క విముక్తికిఁ గారణంబగున్. 176

—♦ ముముక్షువు జ్ఞానవైరాగ్యములఁ జేకొనవలయు ♦—

క. వైరాగ్యవివేకమ్ముల
నారూఢత మనము శుద్ధమయి ముక్తిఁ గనం
గోరెడుఁ గాన ముముక్షువు
లీరెంటిని మున్ను గూర్ప నెన్నఁగవలయున్. 177

—♦ విషయత్యాగము జ్ఞానవైరాగ్య ♦—

క. విషయారణ్యస్థలముల
విషమస్థితిఁ జిత్తమనెడు బెబ్బులి తిరుగన్
విషమనుచు ముముక్షువు లటఁ
గృషిసేయఁగఁ దగరు సాధుకీర్తులగుటచేన్. 178

—♦ మనోవికారములు ప్రపంచభేదములు ♦—

చ. వివిధశరీరవర్ణకుల భేదము లాశ్రమ ధర్మభేదముల్
భువి గుణకర్మహేతుఫలముల్ విషయమ్ములనెల్లఁ గల్గఁగా
జవమున సర్వకాలముల జాగ్రదవస్థను స్వప్నవేళలన్.
భవమొనరించుఁదామనము బాగుగ స్థూలతచేతసూక్ష్మతన్.

—♦ మనస్సు జీవుని భ్రమింపఁజేయును ♦—

ఉ. ఏవిధమైన సంగముల నింతయు నంటకతాఁజిదాత్మ యా
జీవుని మోహవంతునిగఁ జేసి శరీరగుణేంద్రియమ్ములున్
జీవితధర్మశీలములఁ జిక్కబిగించి మనస్సుజస్రముం
బో విడకుండఁద్రిప్పు ఫలభోగముతోఁ దనకర్మసంతతిన్

—♦ మనస్సు అధ్యాసకారణము ♦—

మ. అలరున్ సంసృతిపూరుషాత్మునకు నధ్యాసానుతాపంబునం
గలుషాధ్యాసయునీమనస్సునన సంకల్పంబుఁదానొందుఁజం
చలతన్ రాజసతామసాఖ్యగుణదోషస్వాంతుఁడౌమూఢునిం
బలు కష్టంబుల నింపహేతువగునీస్వాంతమ్ముజన్మాదులన్.

—♦ మనస్సుమాయ ♦—

క. ఈ కారణమునఁ దత్వా
లోకను లనిలమున మేఘరూపము గతినిన్

లోకముఁ ద్రిప్పు మనస్సును
బ్రాకటముగ మాయయనుచుఁ బల్కుదురెలమిన్. 182

— మనశ్శుద్ధి ముక్తిప్రదము —

క. కనుక ముముక్షువు యత్నము
నొనరుప దగు మనసు శుద్ధి నొందుట పొంటెన్
మనసు వినిర్మలమొందినఁ
దనరును మోక్షమ్ము హస్తతలఫలము గతిన్. 183

— విషయరహితబుద్ధి రజోగుణశూన్యము —

క. ముక్తిఁ గనుకోర్కి విషయవి
రక్తుండై సన్న్యసించి శ్రవణాదులనా
సక్తి శ్రద్ధలఁ గాంచిన
యుక్తిని రాజసమునొందకుండు నరుఁడిలన్. 184

— వికారముల మనస్సుపరమాత్మగాదు —

ఉ. ఆదియునంతముంగనుటయన్నివికారములొందుచుండుటన్
ఖేదవిలాసమై విషయకీలలకాకరమై తనర్చుటం
గాదుపరాత్మసూక్ష్మమతి గాంచమనోమయకోశమెప్డుదు
ర్వాదమదేలసాక్షికనువస్తువునాజనరాదొకింతయున్. 185

— బుద్ధి బంధకారణము —

క. మానాభిమానవృత్తులు
నేనను కర్తృత్వమొంది నెరిఁ శేముషి తా
జ్ఞానేంద్రియయుతమై వి
జ్ఞానమయత్వమున బంధజనకంబరయన్. 186

—♦ విజ్ఞానమయ మభిమానపూరితము ♦—

చ. అనుగమనమ్మునొందెడిచిదాత్మనుబింబబలమ్మునొందుచున్
ఘనముగ మాయచేఁగడఁగి గ్రాలుచు జ్ఞానసుకర్మశక్తిమైఁ
తనరుచు నాది నేనని సదాతను ముఖ్యములందు నెల్ల నిం
పెనయఁగ జ్ఞానకోశ మిలనెంతయు గర్వముతో వసించెడిన్.

—♦ జీవుఁడు కర్మఫలానుభావి ♦—

ఉ. నేనను ప్రజ్ఞ నొందుచు ననిర్ణయ కారణుఁడౌచు సర్వకా
ర్యానుగత ప్రభావమును నందుచు జీవుఁడు పూర్వకర్మసం
ధానమున న్సుకర్మలను దార్ష్ట్యములం బొనరించి పిమ్మటం
దాన తదీయకర్మఫలితమ్ముల నెల్లను బొందుచుండెడిన్. 188

చ. మఱియు నితండుచిత్రతర మానవగోఖగముఖ్యయోనులం
దొరలుచుఁబైకిఁ గ్రిందకిని దూఁకుచు వచ్చుచుఁబోవుచుండెడిం
బరువడి సౌఖ్యదుఃఖములు స్వప్నసుషుప్తులు జాగరూకతా
పరిణతి జ్ఞానకోశమునఁ బర్వెడు నెప్పుడు నో బుధాగ్రణీ!

—♦ విజ్ఞానమయము జీవోపాధి. ♦—

సీ. నాదియటంచు దేహాది తత్వమ్ములఁ
గల్పితమ్మగు సర్వకర్మధర్మ
వర్ణాశ్రమాచార నిర్ణయగుణముల
నభిమానమునఁ బ్రజ్ఞనందునట్టి
విజ్ఞాన కోశము వెలిఁగెడు నెక్కుడు
పరమాత్మ సన్నిధిఁ దిరుగుచునికిఁ
బరమాత్మ సన్నిధిఁ బరగిన కతమునఁ
దత్కోశమాత్మగాఁ దలఁచిభోక్త

గీ. భ్రమను సంసారజలధిని బడుచునుండుఁ
గాన జీవున కిలను విజ్ఞానకోశ
మొనరుచుండు నుపాధియై యనవరతముఁ
గర్మగుణములఁజిక్కి సంకటములఁ బడ. 190

—♦ స్వయంజ్యోతి స్వభావము ♦—

గీ. ప్రాణపంచకమందు హృత్పద్మమందు
జానుగను వెల్గుజ్యోతి విజ్ఞాన కోశ
మాత్మ కూటస్థమైన నుపాధినుండి
కర్తయును భోక్తయును నయి క్రాలునెపుడు. 191

—♦ ఆత్మ ప్రపంచమును భిన్నముగఁ దలఁచును ♦—

ఉ. సకలము స్వస్వరూపమయి సన్నుతినొందుచునున్న శేముషీ
వికలతఁ దాఁజరించుటను వేడ్కమృషాత్మల దాననేమహా
ద్వికృతిని మృత్తికన్ ఘటము వేఱని తెల్పెడిరీతి నాత్మతా
సకలము వేఱునాకనుచు సంతతముం దలపోయుచుండెడిన్.

—♦ చిదాత్మకు గుణదోషములుండవు ♦—

చ. పరుఁడయి సర్వకాలముస్వభావగుణమ్మున నేకరూపుఁడై
పరగు చిదాత్మబుద్ధిగల బాంధవమొంద నయోవికారముల్
దరిఁగను వీతిహోత్రుగతిఁ దద్గుణముల్గలవాని పోలికన్
వరలు నుపాధధర్మముల వాస్తవమెన్న గుణాతిరిక్తమై. 193

—♦ శిష్య ప్రశ్న ♦—

క. పరమాత్మకు జీవత్వము
పరగును గాకన్యగతిని భ్రమచేనైనన్

స్థిరతర ముపాధియగుటను
స్థిరవస్తువు నాశనమ్ముఁ జెందుటదెట్లో? 194

క. తద్గతి నీపరమాత్మకు
సద్గురు జీవత్వమిలను సంసారము ని
త్యోద్గమమగు నీరెంటికి
సద్గతి యెట్లగును దెల్పఁ జాలదు గాదే? 195

—♦ కల్పిత మప్రమాణము ♦—

క. బాగుగఁ బ్రశ్న మొసర్చితి
వో గుణనిధి! వినుము దాని నొద్దిక మీఱన్
రాగమున మోహితాత్ముల
చేఁగల్పిత మనిజమనుచుఁ జేర్చుము మదిలోన్. 196

—♦ పరమాత్మయందు భ్రాంతి ♦—

క. ఏకర్మఁ గొసక సంగత
నాకృతిశూన్యుఁడగు నలచిదాత్మకు వస్తు
వ్యాకులము భ్రాంతి గలిగెడు
నాకృష్ణత్వాదు లాకసాదులఁ బోలెన్. 197

—♦ ఆత్మ జీవత్వ నాశనము ♦—

చ. నిరతముసర్వసాక్షియును నిష్క్రియుఁడున్ గుణశూన్యుఁడున్న
దా।స్ఫురదకళంకమూర్తియగుపూర్ణపరాత్మకు బుద్ధిమాయచేఁ
బరగిన జీవభావము భ్రమత్వమసత్యము మోహమంతముం
బొరసినచో నశించునదిపొందుగవస్తుగుణంబు గామినిన్.

చ. భ్రమతనఁబొందు నంతకును బాముగు రజ్జువు భ్రాంతిపీడ స
ర్పమునఁనశించునవ్విధిఁబ్రమాదముచేభ్రమయుండునంత కే

యమగు నవిద్యచేఁగలుగునట్టి భవమ్మును జీవభావమున్
భ్రమనశియింపనాత్తుటిన బాయునుసంసృతి జీవభావమున్.

—♦ అనాదియైననుమాయ జ్ఞానముననశించును ♦—

ఉ. మాయనువోలెఁ దద్గుణసమాహితకార్యమనాదియైతగుఁ
హాయిగ జ్ఞానముంగన ననాదియునైనఁ దమోదిభేద సం
ఛాయముసర్వముందొలఁగుఁదద్దయుమూలముతోడ స్వప్నసం
ధాయమదెల్ల మేల్కొననయంబుగ నాశనమొందుకై వడిఁ.

క. ఇదిమొదలు లేనిదైనను
బదిలముగనకుండుఁ బ్రాగభావము కరణిఁ
మొద లెంతలేకయుండినఁ
బదపడి నశియించుఁ బ్రాగభావము విధిగఁ. 201

—♦ ఆత్మ జీవవిలక్షణము. ♦—

గీ. బుద్ధిసంబంధమున నాత్మఁబొసఁగునట్టి
దైన జీవత్వమస్థిర మవును భిన్న
మైన జీవత్వమస్థిరమవును భిన్న
మైన పరమాత్మ జీవునకన్యమగును
బుద్ధిసంబంధమాత్మను బొసఁగుభ్రమను. 202-203

—♦ జీవేశ్వరైక్యత సమ్యగ్జ్ఞానము. ♦—

క. ఇతనికి సమ్యగ్జ్ఞానో
న్నతి వినిమయమన్యపథమునం బొసఁగ దిలఁ
మతి నాత్మేశ్వరులొకటిగ
శ్రుతిమతమునఁ దెలియునదియ సుజ్ఞానమగున్. 204

—♦ ఆత్మానాత్మ వివేకజ్ఞత ముఖ్యము. ♦—

క. బాగుగ నాత్మానాత్మలఁ
దాఁగన సుజ్ఞానసిద్ధి దనరును గానన్
వేగమె యాత్మానాత్మల
యోగత్వవివేక మెఱుఁగు టొప్పగును ధరన్. 205

—♦ మాయారహితాత్మ స్ఫుటము. ♦—

క. అమితమగు బురదఁగూడిన
యమృతము కర్దమముఁబోవ నతినిర్మలమై
రమణీయమయిన తెఱఁగున
విమలప్రభఁగాంచు నాత్మ వికృతిఁ దొరఁగుటన్. 206

—♦ అహమాదులు జ్ఞేయములు. ♦—

క. మిథ్యావిద్యనసింప న
సాధ్యాద్వయ రూపమునఁ జిదాత్మ స్ఫుటముగన్
వేద్యమగుఁ గాన లసదన
వద్యత నహమాదివస్తు వర్గ మెఱుఁగనౌ. 207

—♦ విజ్ఞానకోశ మాత్మగాదు ♦—

ఉ. పూనికనై వికారములఁబొందుట దృశ్యజడత్వ ధర్మ సం
ధానమునన్విభేదములఁ దాల్చుట నన్యగతిం జరింప వి
జ్ఞానమయమ్ము యాత్మగ వెసందనరార దనిత్యమెప్పుడున్
మానుగ శాశ్వతంబగుచున్మాన్పడఁజొప్పడకుండు నెయ్యెడన్.

—♦ ఆనందమయకోశము ♦—

సీ. మాయా విలాస సంభ్రమమునం బ్రకటిత
మై సత్త్వగుణమున నలరునదియు

న్యానందమగు నాత్మ నలరు బింబమునందు
నణఁగు స్వాకారమ్ము నందునదియుఁ
దనకిష్టమగు పదార్థంబు లభ్యంబైన
నత్యంత మోదము నందునదియుఁ
బ్రియముఖ్యగుణముల వేడ్కనొందెడునది
పుణ్యానుభవమునఁ బొసఁగునదియు
గీ. నయిన యానందమయకోశ మందు దేహ
ధారులగు సర్వజనములుఁదన్మయత్వ
మందుచుందురు కడువేడ్క యత్నమేమి
తామొనర్పక సతత ముదంబుఁ గనుచు. 209

—♦ సుషుప్తి ఆనందమయకోశప్రకాశము ♦—

క. ఆనందమయము నిద్రను
బూనినచో మిగులకాంతిఁ బొందు హితము లౌ
వానిగనఁ గాంతి దరగును
జానుగఁ గల నొందు వేళ జాగ్రదవస్థ. 210

—♦ ఆనందమయ మాత్మగాదు ♦—

క. ప్రకృతి వికారంబగుటను
సుకృతమునకు హేతువగుట సోపాధికతన్
వికృతి సమాహితమగుటను
బ్రకటానందంబు కాదు పరమాత్మభువిన్. 211

—♦ ఆత్మ పంచకోశాతీతము ♦—

క. వేదమువలనను యుక్తిని
గాదనుచును బంచకోశగణ మెడబాయన్

మోదాత్ముండైన సాక్షి ని
షేధము మెఱగుచుం దాను శేషమును గనున్. 212.

—• ఆత్మయే పరమాత్మ •—

గీ. పంచకోశాతిరిక్తమై బహువికార
శూన్యము నిరంజనమ్మయి జ్యోతియునయి
సాక్షి యానందమయమయి చనెడునాత్మం
దెలియుదురు స్వాత్మయని మదిధీరులెపుడు. 213

—• శిష్య ప్రశ్న •—

చ. సరగునఁ బంచకోశముల సత్యతఁదీవ్రనిషద్ధమైనచో
గురువరసర్వశూన్యమయికొంచెము నేనియుఁ గానరాదిటం
బరువడి నాత్మతత్వమును భావనఁజేయుబుధోత్తముండు తా
నరయఁగసర్వమైతనరు నట్టిపదార్థమదేది స్వాత్మగాన్.

—• సాక్షియే పరమాత్మ •—

సీ. పండితాగ్రణి! నీవు పల్కిన వాక్యమ్ము
సత్యమ్ము తత్వవిచారమందు
నతి సమర్థుఁడవైతి వహమాదియగు వికా
రములకు వానిశూన్యమునకు మఱి
నీసమస్తమునకుఁ దా సాక్షియై యుండి
చిక్కక సకలముఁజొక్కనెవ్వఁ
డట్టి సర్వజ్ఞుని నఖిలాత్మ సాక్షిని
నతిసూక్ష్మమతి నాత్మయనఁగఁ దెలియు

గీ. మనుచు సద్గురులెంతయు నాదరమున
నజ్ఞుపోలికఁ బ్రశ్నించునట్టిశిష్యు

సర్వశూన్యంపు భావము సమసిపోవ
నొక్కవాక్రుచ్చి ధన్యతనొందఁజేసె. 215-216

—♦ అనుభవవంతుఁడు సాక్షి ♦—

క. ఏయేపదార్థమనుభవ
మై యెవ్వనికుండు వానికగు సాక్షియతం
డాయనుభవమ్ము శూన్యం
బై యుండిన సాక్షియెవ్వఁడగు విషయములన్. 217

—♦ సాక్షియగుటఁదాఁ బరమాత్మ ♦—

క. తనకీస్వసాక్షిభావం
బనుభవ మేకతననగునో యాహేతువునన్
ఘనమైన యాత్మ తానగు
జనుఁ డితరుఁడొకండుఁగాఁడు సత్యంబరయన్. 218

—♦ అహంకారాదిసాక్షి పరమాత్మ ♦—

సీ. మూఁడవస్థలయందు ముప్పొద్దు నెల్లప్పు
డేనునేనని మదిలోనఁ జెలఁగి
ప్రత్యక్స్వరూపతఁ స్పష్టతరంబుగ
వెలిఁగి విజృంభించి వివిధములగు
నాకారవికృతులనందు నహంకార
బుద్ధ్యాదులను సదాపొంచికనుచు
సర్వకాలములందు సంతతానందస్వ
రూపంబుఁ గనుచు నిరూఢతఁదగ
గీ. హృదయపంకజమందున సదమలముగ
వెలుఁగుసీతనిఁ దానని వేడ్క నెఱిఁగి

సర్వశూన్యంపుభావము సరగవీడు
మాత్మతత్త్వవివేకమువంటి విబుధ! 219

— మూఢుఁడాత్మను తానని భ్రమించును —

చ. ఘటజలమందు బింబమునుగాంచు దివాకరబింబకాంతి ను
త్కటముగ మూఢమానసుఁడుగాంచినభోమణిగాఁదలంచుచు
న్నటుగ నుపాధియం దునికినందిన చేతనరూపబింబముం
బటుమతిగాక తాఁజెడుఁడు భ్రాంతిని నేననియూహసల్పెడిన్.

— తత్త్వవేత్త - పండితుఁడు —

చ. ఘటముదకమ్మునన్ జలముఖంబగు భాస్కరబింబమున్సదా
యెటులుబుధోత్తముండుమది నెంచుచు నీత్రితయమ్మువీడి, మూ
డిఁటిని వెలుంగఁజేయుచును కేవిఁదటస్థముగా స్వకాంతి ను
త్కటముగ వెల్గుతిగ్మరుచిఁగాంచుచునుండునో తద్విధంబునన్.

— ఆత్మజ్ఞాని బ్రహ్మానందమయుఁడు —

సీ. పురుషుండు తనువును బుద్ధి నాబుద్ధినిఁ
బ్రతిఫలించెడు చిదాభాసు విడిచి
ధీగుహాంతమునందుఁ దేజరిల్లుచునుండు
ద్రష్ట నఖండబోధస్వరూపు
సర్వప్రకాశుని సదసద్విలక్షణు
విభు నిత్యు సర్వము వెలయు నతని
నత్యంతసూక్ష్మని నంతర్బహిశ్శూన్యు
సాటిలేనట్టి నిజస్వరూపు

గీ. నెఱిఁగి నిర్భీతి నీభువి నెపుడు దోష
శోకమృత్యురజోగుణశూన్యుఁడగుచుఁ

ఖండితుండయి సుఖమొందు భవవిముక్తి
కాత్మనెఱుఁగుటకన్న నయంబులేదు. 222-223-224.

—♦ జీవేశ్వరజ్ఞత బంధవిముక్తి ♦—

క. జీవేశ్వరు లొక్కండను
భావమునెఱుఁగుటయ ముక్తిపదకారణమౌఁ
గోవిదుఁడాజ్ఞానముఁ గని
శ్రీవెలయఁగ నాత్మసిద్ధి స్థిరముగనొందున్. 225

—♦ బ్రహ్మజ్ఞునకు జన్మలేదు. ♦—

క. బ్రహ్మత్వమొనర నొందిన
బ్రహ్మణ్యుఁడు మరలరాడు భవమొంద భువిన్
బ్రహ్మత్వమట్టిదగుటను
బ్రహ్మాత్మాఽభేదమెఱుఁగవలయును వెలయన్. 226

—♦ పరమాత్మ సత్యాద్యానందము. ♦—

క. సత్యము జ్ఞాన మనంతము
నిత్యానందాద్వైకరసము నిష్కలము పరం
బత్యంతశుద్ధ మఖిలముఁ
బ్రత్యగ్భిన్నమ్మ నగుచు బ్రహ్మము వెలయున్. 227

—♦ తత్వవేత్త భేదశూన్యుఁడు ♦—

క. పరమాత్మ సత్యమును మఱి
పరవస్తువు తనకు లేమిఁ బరమాద్వయమౌ
పరమార్థతత్వ మెఱిఁగెడి
తఱి, భిన్నముగొంచెమేనిఁ దనరదు తనకున్. 228

—♦ నిజమెఱింగినఁ దానేబ్రహ్మము. ♦—

క. అవివేకవిశేషమునన్
వివిధ వికారములవెలయు విశ్వంబెల్లం
బ్రవిమల పరమాత్మయ యగు
నవయంగఁ గల్పాఖ్యదోషమంతయు విబుధా! 229

—♦ మృద్భాండము లభిన్నములు ♦—

ఉ. భాండము మృత్తికన్వివిధపాత్రలఁగాంచిన మృద్విభిన్నమై
యుండదు;కుంభరూపమును నొప్పఁగ మృణ్మయభిన్నమొంది
తా।నుండదు,నామమాత్రముననుండిన భాండ మసత్యకల్పనన్
భాండమనంగఁబేర్కొనెడుభాండముమృణ్మయభిన్నమెట్టులౌ

—♦ ఘటము కల్పితము, మృత్తిక సత్యము. ♦—

చ. ఘటమును మృత్పదార్థమునకన్న విభిన్నమటంచునెన్నదు
ర్ఘటమగు నేరికేనినటుగావున భాండము మోహశేముషీ
ఘటితము తథ్యరూపమయిగ్రాలెడిమృత్తికయే యథార్థసం
ఘటనముఁగాంచు సత్యమునుగల్లఁగఁదెల్పుట కేరిశక్యమౌ.

—♦ జగత్తు బ్రహ్మకన్నఁనభిన్నము ♦—

చ. ఇటుపరమాత్మకృత్యమగు నీసకలమ్మును సత్స్వరూపమీ
ఘటనముతత్స్వరూపమయిగ్రాలెడునాపరమాత్మకన్ననిం
కెటుఁగనలేమభిన్నమొకఁడెవ్వఁడుదెల్పునొయున్నదంచుఁబ్రా
కటముగవాఁడుభ్రాంతుఁడనఁగాఁబడునిద్రితుఁడుంబ్రజల్పుఁడై

—♦ సర్వముఁ బరమాత్మ ♦—

క. ఈవిశ్వము బ్రహ్మంబని
శ్రీవేదము దెల్పుచున్కి క్షితి బ్రహ్మమయా

న్నావిర్భూతమునకు భువిఁ
దావాధారమునకన్నఁ దగవేఱున్నే ? 233

—♦ వస్తు తత్వామలహాని సత్యమనుట యసత్యము ♦—

చ. తనరూపంబున నీప్రపంచము సదాతథ్యంబయేా నన్నచో
ఘనతం దత్వముహానినొందుటయ కాకన్ వేదవాక్యమ్ముపొం
దునుదుష్కీర్తినిసప్రమాణమనియెందున్వేద్యుఁడౌనీశ్వరుం
డునసత్యుండగుతత్వవేత్తకివిమూఁడున్ హేయభూతంబులౌ.

—♦ శ్రీకృష్ణవాక్యము ♦—

క. ఆత్మవివేకజ్ఞుఁడు పర
మాత్ముఁడు శ్రీకృష్ణుఁడిటుసమర్థించెనదా
యాత్మలఁ జరింప నేనా
యాత్మలు నాయందునునికినంగవటంచున్. 235

—♦ జగత్తు మిథ్య ♦—

క. శాశ్వతమని పల్కినచో
విశ్వము ఘననిద్రయందు వెలుఁగఁగవలయున్
శశ్వత్సుషుప్తినుండమి
నశ్వరము మృషాభిరూపమగుకల వోలెన్. 236

—♦ పరమాత్మ భ్రమచేఁ గల్పితుఁడు ♦—

ఆ. జగము మిథ్యయగుట సత్స్వరూపముకన్న
వేఱుగాదు జడులు వేఱనుటయు
మిన్నగొనమురీతి మిథ్య కల్పిత మస
త్యమ్మధిష్ఠ మనని నమ్మె భ్రమను. 237

—♦ జగత్తు సత్తాశూన్యము ♦—

చ. భ్రమగలయట్టివానికెడ భ్రాంతిని నెయ్యది వేళతోఁచునా
సముదయమెల్ల బ్రహ్మమవిచారతఁదోఁచిన వెండిముత్యమై
యమరెడు బ్రహ్మమెల్లపుడ నాత్మనిరూపణమొందుచున్న నా
మమునకు మాత్రమింపలకు త్మాతలమంచును వాస్తవంబుగన్.

—♦ పరబ్రహ్మ స్వరూపము ♦—

క. పరమాత్మ ప్రశాంతము సు
స్థిరము నిరంజనము నద్వితీయా క్రియముల్
మరణభవరహిత మంచిత
పరిపూర్ణానందసుప్రభావము మఱియున్. 239

ఉ. మాయఁ జెలంగునట్టివగు మార్పులనెల్లను దోలునట్టిదిన్
హాయిగ నందునట్టిది ధ్రువాయతనంబును నప్రమేయబో
ధాయుతమవ్యయమ్మును ననాహ్వయమాకృతిశూన్యమింద్రియ
జ్ఞేయముగా నియట్టిదియుఁ జేతనరూపము నిష్కలమ్మునౌ.

—♦ తత్త్వజ్ఞానము జ్ఞానికేయెఱుక ♦—

గీ. తెలియఁదగినది తెలియుట తెలియునతఁడు
గాక నంతము కేవలాఖండచిత్స్వ
రూప మవికల్పమై క్రాలు నాపరాత్మ
తత్త్వము దెలియుదురు పరతత్త్వవిదులు. 241

—♦ నేన పరమాత్మనని తెలిసికొనుము ♦—

ఉ. హేయముకానిదిన్ సతతమిష్టపదార్థవిశేషమంచిలం
దీయ నశక్యమైనయది తెల్పఁ నగోచర మప్రమేయమై

యేవెుడ నాది యంతమును నెంచఁగలేనిది పూర్ణమైన తే
జోయుతమైన బ్రహ్మమునుజొ•క్కుచు నేననుచుండు మెప్పుడున్•

—♦ జీవేశ్వరైక్యత శ్రుతిసమ్మతము ♦—

గీ. అదియు నీవను పదముల నధిగమించు
నట్టి జీవాత్మవిరీతి నరయఁబడఁగ
నదియ నీవైతినని తెల్పునట్టి శ్రుతుల
నైక్యమాపాదమయ్యె జీవాత్మలందు 243

—♦ జీవేశ్వరైక్యత లక్ష్యానుభవము ♦—

సీ. మిణుకు మిణుక్కను మిణుఁగురుపుర్వుకు
ఖరకరుఁడగు దినకరునకు వలె
మేదిని నేలెడి మేదినీశ్వరునకుఁ
దనుఁగొల్చునట్టి భృత్యునకువలెను
బహుసూక్ష్మమగునట్టి పరమాణువునకును
గురుతరంబగు మేరుగిరికి వోలెఁ
బరిమాణమున నెన్నఁబడు కూపమునకును
ఘనమపారమునగు వనధికివలెఁ
గీ. దనర నన్యోన్యమును విరుద్ధమ్ములైన
ధర్మములుగల్గు జీవాత్మతత్వములకు
నైక్యభావము వాక్రువ్వనలవిగాక
చెప్పఁబడె లక్ష్యమునఁ గనఁజిత్తమలర. 244

—♦ జీవేశ్వరులు కార్యకారణోపాధులు ♦—

ఉ. వైరముభోక్తకాత్మకు నుపాధివశంబునఁ గల్గువాస్తవం
బారయలేద దేదియుఁ జిదాత్మకుపాధిమహత్వదాదికిం

గారణమైనమాయయయి గ్రాలెడునన్నమయాదికోశముల్
వారక మీఱిజీవులకుపాధిగ నొప్పెడుకార్యరూపతన్. 245

—♦ సర్వముమిథ్య బ్రహ్మసత్యము ♦—

చ. ఇవిపరమాత్మజీవములకిర్వురకొప్పు నుపాధులౌచు న
య్యవియు నిరాసజేయఁబరమాత్మయుజీవుఁడు లేకయుండెడిన్
భువనము రాజచంద్రునకుఁ బ్రోలిలభృత్యునకౌనుపాధులా
భువనపురంబులుండొలఁగిపోయిన రాజుభటుండువో వనీ
భువిఁబురుషుండు శేషమగుపోడిమి బ్రహ్మము శేషమయ్యెడిన్.

—♦ ఉపాధిద్వయమును విడువవలయును ♦—

క. నయముగను "నథాతోదే
శయ" యనుశ్రుతి యుగము నెపుడుఁ జక్కఁగవీడన్
భయరహితబోధ నేత
ద్వయమును విడనాడవలయుఁ దప్పక విబుధా! 247

—♦ దృశ్యనిషేధమున జీవేశ్వరైక్యమెఱుంగవలయును ♦—

ఉ. స్థూలమునైతనర్చు దిదిసూక్ష్మముగాదిది కల్పితంబుగాఁ
గ్రాలినచాట రజ్జువునఁ గాంచిన సర్పముభాతినిం గలం
బోలె నసత్యమా; శ్రుతినిబుద్ధిని దృశ్యమునెల్ల నిట్లుపోఁ
ద్రోలితదైక్యముంగనుబుధుండ! మదింగదుసూక్ష్మతన్సదా! 248

—♦ జహదజహల్లక్షణము జీవేశ్వరసిద్ధి ♦—

క. జహదజహత్తులు వేఱయి
యహరహమాత్మేశ్వరైక్యమగు సిద్ధిఁగనన్
సహకారమెుసఁగఁ జాలవు
జహదజహల్లక్షణమ్మ సాయంబిడున్. 249

—♦ జహదజహల్లక్షణము ♦—

ఉ. అచ్చట నిచ్చటంగలుగు నైక్యము భేదము నెల్ల వీడుచో
నచ్చట దేవదత్తుఁడితఁడౌనని యెట్టులు బొల్చుచుండునో
యిచ్చట రెండుచోట్ల వెసనీవిధిఁ "దత్త్వమసీ" తివాక్యమం
దచ్చుగ భేదశూన్యతను నా పరమాత్మ యొకండు శేషమా. 250

—♦ జీవేశ్వరాభేదమును బండితులంబోలె శ్రుతియుఁ జెల్పుచుండె ♦—

ఉ. జీవపరాత్మరూపములఁ జేతనరూపము మైఁగరంబు సం
భావనఁజేసి కాంచి బుధవర్గమఖండము నెట్లుగాంచునో
యావిధి బ్రహ్మకాత్మకును నైక్యమఖండమటంచుఁ దెల్పు సం
భావనచేసిచేసి శ్రుతివాక్యశతమ్ము మహత్తరంబుగన్. 251

—♦ పరబ్రహ్మమీవయని తెలియుము ♦—

సీ. ఆత్మను గల్పితంబగు నీయసత్తును
నస్థూలమనుచుఁ ద్యాజ్యంబొనర్చి
సిద్ధస్వరూపమై చెలఁగు గగనమట్లు
నప్రతర్క్యాత్మగ నరయు మెపుడు
పంచకోశాత్మసంబంధ ప్రపంచంబు
స్వాత్మతత్త్వమ్మున వరలుచునికి
నెరిగృహీతమునొంది నెగడి మృషారూప
మగుట నీజగమును నవలద్రోసి

గీ. నేను బ్రహ్మమునని యెడి నిర్మలమగు
బుద్ధి నద్వయమానందపూర్ణముఁదగ
జ్ఞానమయమగు నాత్మగా స్వాంతమందు
నిత్యతత్త్వవిచారణ నిన్ను గనుము. 252

సీ. మృత్తికవలన సత్ప్రత్తినొందినదయి
యెప్పుడునిజమని యెంచునట్టి
సకలఘటాదికనికరమదెట్టులు
నరయ మృణ్మయమయి యలరునోయటు
సజ్జనితంబయి సత్స్వరూపమ్మన
నలరు నీసకలవిశ్వాదిచయము
సత్స్వరూపమ్మగు సత్తుకన్ననుభిన్న
మైనదెద్దియుఁ గొంచెమైనలేదు
గీ. ఆ సదాత్మ సదాసత్యమగుటవలన
నదియ శాంతము నమలము నద్వయమ్ముఁ
బరమునైనట్టి బ్రహ్మ మాబ్రహ్మమీవ
యైతి వద్దానికన్న వేఱరయలేదు. 253

సీ. జ్ఞాతయు దేశము సకలవిషయములు
నిద్రనెట్టులుదోఁచి నిజముగావొ
యట్లుజాగ్రదవస్థ నజ్ఞానవశమునఁ
గల్గుప్రపంచము కల్లయగును;
ఈరీతిదేహము నింద్రియమ్ములుఁ బ్రాణ
మహమాదులును గూడనగునుమిథ్య
యద్దానశాంతము నమలముఁబరమును
నద్వయమ్మగుబ్రహ్మ మైతివీవ
గీ. భ్రాంతిఁగనుపట్టువస్తు వాభ్రాంతిపోవఁ
బోయినిజవస్తువెట్టులు బోధపడునొ

యట్టులుకలఁ దోఁచుజగమంతనడఁగు కలను
బోధఁదనకన్నఁ బరవస్తు వేదిలేదు. 254-255

— పరమాత్మవర్ణన —

గీ. జాతికులగోత్రములులేక నీతినామ
రూపగుణదోషములులేక రూఢిదేశ
కాలవిషయాతివర్తియై క్రాలునట్టి
యాపరబ్రహ్మమీవని యరయుమెదను. 256

గీ. వచనములకందరానిది పరము విమల
బోధచక్షువుననుగనఁ బొసఁగునదియు
శుద్ధచిద్ఘన మాదినిజూడఁబడని
యాపరబ్రహ్మమీవని యరయుమెదను. 257

గీ. తరగలాడింట నొనరదు దొరకదింద్రి
యముల బుద్ధినిజిక్కదు విమలయోగి
హృద్విలాసము దోషరహిత విభూతి
యగు పరబ్రహ్మమీవని యరయుమెదను. 258

గీ. భ్రాంతికల్పితమగు జగద్భాగములకు
శరణ ముపమానరహితము స్వాశ్రయమును
గరణరహితము స్థూలసూక్ష్మములభిన్న
మైన యాబ్రహ్మమీవని యరయు మెదను. 259

గీ. జన్మవృద్ధులు క్షయవినాశన విపరిణ
తామయాది విహీనమవ్యయము విశ్వ
సృష్టిరక్షణనాశన హేతువైన
యా పరబ్రహ్మమీవని యరయుమెదను. 260

గీ. భేదరహితమ్మ వస్తువిచ్ఛేదశూన్య
మూర్మి రహితసముద్రము నోజఁజలన
మొందనిది నిత్యముక్తము నోజఁగలది
యైనయా బ్రహ్మమీవని యరయుమెదను. 261

గీ. అద్వితీయము జగమునకాకరమ్మ
కారణాంతరభిన్న మకారణమ్మ
కార్యకారణ భిన్నము ఘనమునైన
యాపరబ్రహ్మమీవని యరయుమెదను. 262

గీ. నిత్యమవ్యయసౌఖ్యము నిర్వికల్ప
కమ్మఁ బరమాక్షరమ్మ వికారశూన్య
మధిక మానందమయమును నైనయట్టి
యా పరబ్రహ్మమీవనియరయుమెదను. 263

గీ. వికృతిశూన్యత్వమునుగాంచి వేడ్కనెపుడు
భ్రాంతిఁదానామరూపాదిభంగములను
గాంచి కనకముగతి ననేకముగఁ గ్రాలు
నా పరబ్రహ్మమీవని యరయుమెదను. 264

గీ. వెనుక మునుమున్న లేకను వెలుఁగుచుండి
సత్యచిత్సుఖరూపమై సర్వకార్య
కారణంబులఁబరుఁడయి క్రాలునట్టి
యా పరబ్రహ్మమీవనియరయుమెదను. 265

— పరమాత్మచింతన సాక్షాత్కారసిద్ధి —

క. ఈవిధమగు పరమార్థము
భావముననుమతిని శ్రుతుల భావింపఁగ నా

భావమునఁగరతలాంబువు
త్రేవను బరమాత్మఁగను గేవలుఁడైనక. 266

—♦ విశ్వము బ్రహ్మస్వరూపము ♦—

చ. కరితురగాదిసైన్యతతిఁ గ్రాలుచునుండునరాధిపున్వలెం
గరణములందు నిత్యము వికాసమునొందెడి బ్రహ్మతత్త్వమీ
వరసి తదాశ్రయుండవయిస్వాత్మ ననారతమున్వసించుచున్
వరలుసమస్తవిశ్వమును బ్రహ్మమయంబని యెంచు మోబుధా!

—♦ బ్రహ్మజ్ఞానికిఁ బునర్జన్మలేదు ♦—

క. సదసద్విలక్షణము స
మ్మదమయమద్వయము సత్యమునగు పరమున్
హృదయగుహానెఱుఁగ నేర్చిన
బుధుఁడు పునర్జన్మ మెపుడుఁ బొందకయుండున్. 268

—♦ వాసనానాశనము ముక్తి ♦—

సీ. ఋతమగువస్తువు నెఱుఁగ ననాదియు
బలముదృఢంబునై పరగు నేను
కర్తను భోక్తనై క్రాలుదుననునట్టి
వాసన భోక్తకు భవనిమిత్త
మగుటఁ దద్వాసన నాత్మప్రత్యగ్దృష్టి
యుండుఁదాఁగడుయత్న మొందివిధిగఁ
గడఁద్రోయఁగాఁదగుఁ గడఁగితద్వాసన
సంపూర్ణముగఁ బాసిచనుటభువిని
గీ. నిచట జీవించియున్నను నెపుడుసౌఖ్య
మైన మోక్షంబటంచుఁ దారనుచునుంద్రు ;

మునులు సదమలతత్త్వచింతననలరెడు
సద్వివేకమనస్కులై చన్నటవలన. 269

—♦ అధ్యాసనశింపఁజేయవలయును ♦—

గీ. ఆత్మగానట్టి దేహేంద్రియాదులందు
నేనునాదను భ్రమచేతనెప్పుడుఁ బొడము
నట్టి యధ్యాసపరమాత్మనరయుచున్కిఁ
బండితోత్తముఁడవిడఁజుఁబుడమిని. 270

—♦ అనాత్మ ఆత్మకాదు ♦—

క. మనసునకుఁ దత్ప్రవృత్తికి
ఘనసాక్షిగ వెల్గుప్రత్యగాత్మను దనుగాఁ
గని సోహమను సుబోధను
ననాత్మలను నాత్మబుద్ధినందకు మెప్పుడున్. 271

—♦ భ్రాంతిత్యాజ్యము ♦—

ఆ. దేహవర్తనమ్ముఁ దెగటార్చి లోకాను
వర్తనమ్ము శాస్త్రవర్తనమ్ము
వీడిమదిని వేడ్కవిడనాడ నధ్యాస
యత్న మొనరఁజేయు మమరవిబుధ! 272

ఆ. గాత్రవాసనమ్ము ఘనశాస్త్రవాసన
విశ్వవాసనమ్ము వేడ్కమూఁడు
నాత్మబ్రహ్మమైక్యమగునట్టి సుజ్ఞాన
మొసఁగఁజాలకుండు నోకపీంద్ర! 273

—♦ వాసనాశూన్యత ముక్తి ♦—

శా. సంసారంబను బంధగేహమున మోక్షంబెంచు నవ్వాని వి
ధ్వంసుంజేయఁగ వాసనాత్రయమయోబంధమ్ముసుమ్మంచువి
ద్వాంసుల్పల్కెడు మోక్షకాంక్షియెవఁడేతద్బంధనిర్ముక్తతన్
సంసారమ్ముత్యజించునో యతఁడు మోక్షంబుందగంబొందెడిన్.

—♦ కర్మవాసనను బ్రహ్మవాసన తిరస్కరించును ♦—

క. మలినంపు నీటిపొత్తుఁ
గలిగిన దుర్గంధమందుఁ గప్పడియుఁడగం
గలఁగుడువడి చందనమొగి
వెలివాసనలడఁచి తాను వెలిఁగెడిరీతిన్. 275

క. అంతశ్రితవిషయాదిదు
రంతపరాగమున ధూసరమ్మగు ఘనస
చ్చింతనము నియతిబుద్ధిని
గాంతినిగనుచుండు మంచిగంధము వోలెన్. 276

గీ. ఆత్మవాసన దేహేంద్రియాదివాస
నాసమూహవిలాసమునందుఁ గ్రుచ్చఁ
బడిన నిత్యాత్మనిష్ఠమైఁగడు వెలుఁగున
నాత్మవాసనలెల్లలయమ్ము నొంద. 277

—♦ వాసనాక్షయమానందము ♦—

క. ఏయేవిధమునఁజిత్తం
బాయత్తంబగునో సాక్షియగుపరమాత్మం
బాయకయాగతి వాసన
బాయుట నాత్మానుభూతి వారకకల్గున్. 278

—♦ అధ్యాస సకలానర్థకారణము ♦—

గీ. మనసు తనయాత్మయందున ననికితగిలి
యుండియును నాశనముఁబొందు యోగికెపుడు
దాన వాసనలన్నియు దైన్యముఁగను
గాన స్వాధ్యాసఁదొలఁగింపఁబూనవలయు. 279

—♦ శుద్ధసత్త్వమధ్యాసముందొలఁచును ♦—

క. సత్త్వరజోగుణములఁదమ
సత్త్వము సత్త్వమునరజము సత్త్వముశుచియా
సత్త్వమున నడఁగుఁ గాన సు
సత్త్వమునందొలఁగఁగరపు స్వాధ్యాసఁగడున్. 280

ఆ. పూర్వజన్మయందుఁబొసఁగినకర్మంబు
తనువునోముననుచుఁ దలఁచి మదిని
స్థిరముగల్గిధైర్యశీలమ్మునొంది స్వా
ధ్యాసతొలఁగ యత్నమాచరింపు. 281

ఆ. నేనుజీవుఁడనిలఁగాను పరబ్రహ్మ
నని యనాత్మవర్గమును ద్యజించి
పూర్వజన్మకర్మఁ బొసఁగినయట్టి స్వా
ధ్యాసతొలఁగ యత్నమాచరింపు. 282

ఆ. యుక్తిచేత నొనర నుపనిషత్తులచేత
ననుభవమ్మువలన నాత్మనలను
నంతరాత్మనరసి యాభాస బుట్టు స్వా
ధ్యాసతొలఁగ యత్నమాచరింపు. 283

ఆ. స్వీకరించుకోర్కి విడిచెడి కాంక్షయు
లేక యుంటకన్న లేదొకింత
మునికిఁగాననీవు గని బ్రహ్మనిష్ఠ స్వా
ధ్యాసతొలఁగ యత్న మాచరింపు. 284

గీ. తత్త్వమస్యాది పదములఁ దనరునట్టి
జీవపరమాత్మలొకఁడని సేయుబోధ
బ్రహ్మనాత్మత్వదార్ఢ్యత బలముపడఁగ
నననినధ్యాసఁదొలఁచఁ బ్రయత్నపడుము. 285

గీ. దేహమందు నహంకృతి తెగువఱకును
సావధానుండవై యోగభావ మొనరఁ
బడసి పరమాత్మనిష్ఠమై భద్రముఁగని
యవని నధ్యాసఁదొలఁచఁ బ్రయత్నపడుము. 286

గీ. సర్వజగమును జీవుఁడు స్వప్నముగతి
మదినిఁ దలపోయునంతకు బుధవతంస!
పట్టువీడక సంతతాభ్యాసముఁగని
యవని నధ్యాసఁదొలఁచఁ బ్రయత్నపడుము. 287

— పరమాత్మచింతనమున నధ్యాసతొలఁగును. —

గీ. నిత్యమును లోకవార్తకు నిద్రకు మఱి
విస్మృతాలస్యములకు దుర్విషయములకు
నెప్పుడేనియు నవకాశమీయకుండ
నాత్మఁ దలచుము పరమాత్మ నంచితముగ. 288

—♦ దేహాభిమానత్యాగ ముత్తమము ♦—

గీ. తల్లిదండ్రులమలమునం దనరినట్టి
మాంసమూత్రపురీషాదిమయ తనువును
నరసి చండాలుగతి వేగ నవలవిడచి
బ్రహ్మవై ధన్యుఁడవు గమ్ము భద్రముగను. 289

—♦ జీవబ్రహ్మైక్యము బ్రహ్మానందము ♦—

గీ. ఘటపిహాయసపులమహాకాశమందు
వలెను జీవాత్మనిం బరబ్రహ్మమందుఁ
బూర్ణభావంబునై లయంబును బొనర్చి
సర్వదా నెమ్మదిగనుండి సౌఖ్యపడుము. 290

—♦ స్థూలబ్రహ్మాండముల నిషేధింపుము ♦—

గీ. సత్స్వరూపవికాసత స్వప్రకాశ
మైనపరిపూర్ణమును నీవయగుచు విడువ
నగును బిండాండము మఱి బ్రహ్మాండముఁ దగ
మలవిపూరిత కుంభమువలె సతమును. 291

—♦ సూక్ష్మ శరీరాభిమానము త్యాజ్యము ♦—

గీ. తనువునాసవహించు నేననెడిమతిని
సంతతానందమయుని నిశ్చలసదాత్మ
నిలిపిలింగశరీరముఁ దొలఁగఁజేసి
సర్వదా కేవలుఁడవయి సౌఖ్యపడుము. 292

—♦ పరమాత్మ నీవేయని తెలియుము ♦—

గీ. అద్దమందున్న పట్టణమట్టులెంచు
నీప్రపంచవిలాసము వృద్ధిఁగనునో

యూపరబ్రహ్మమేనని యాత్మనరసి
ధన్యతనుగాంచి మనుమెన్నఁ దనరనన్న. 293

—♦ బ్రహ్మజ్ఞానివగుము ♦—

ఉ. ఏదియథార్థభూతమగు నెయ్యదియన్నిటికాది లోకమం
దేదిచిదద్వయాత్మక మదెయ్యదరూపము సక్రియంబునా
యాదినిజస్వరూపమును నారసికల్పితమైన దేహమున్
వేదుగనూడ్చివీడఁదగు వేసమువీడునటుంచుఁపోలికన్. 294

—♦ అహమాదులు సర్వమెఱుంగవు ♦—

క. ఈదృశ్యము మృషయగునహ
మాదులు క్షణికత్వధర్మమందుచు నర్థా
పాదమునొందవు క్షణికము
లై ధరఁదగనెట్టులెఱుఁగు నహమాదులొగిన్. 295

—♦ ఆత్మ స్థూలసూక్ష్మభిన్నము ♦—

గీ. క్షణికమైన యహంకారసాక్షియగుచు
నిద్రనలరునహమ్మను నిత్యమనుచు
శ్రుతులుస్వయముగవచియించుకతనఁ బ్రత్య
గాత్మ సదసద్విలక్షణమైనదగును. 296

—♦ పరమాత్మ నిర్వికారము ♦—

ఉ. కోరికలందుస్వప్నములఁగూర్కొను వేళజగంబహంకృతుల్
సారెకుసారెకున్మృషగ స్పష్టముగం గనుపట్టుచో నహం
కారజగత్తులంగలవికారములెల్ల నెఱుంగుచుండుటన్
ధారుణినిర్వికారుఁడయి తాఁబరమాత్మ వెలుంగుచుండెడిన్.

—♦ నిరభిమానత నాత్మ నెఱుంగుము ♦—

ఉ. అంగమహంకృతాదులననాత్మలుగా వ్రునమాంసయుక్తమా
నంగమునందుబుద్ధిని నయంబుగ నీయహమాదులందునర్
భంగమునొందజేయఁదగు పౌరుషమువ్విడి సర్వపూర్ణతా
భంగురమాత్మనేననుచు భావమునంగని శాంతినొందుమా.

ఉ. క్రొన్నెరిపీనుఁగుందగులు గోత్రకులాశ్రమధర్మరూప ని
ష్పన్నమునందునం జెలఁగు పౌరుషమువ్విడి కర్తృతాది ధ
ర్మోన్నతిసూక్ష్మవిగ్రహనముద్భవమానముఁగూడవీడి ని
త్యోన్నతసౌఖ్యమూర్తివయి యుండుమఖండముదంబునం
[దుచున్.

—♦ అహంకారము భవకారణము ♦—

క. పురుషుఁడు సంసృతిదారలఁగ
వరలును గారణములెన్నొ వానినిబ్రథమం
బరయ నహంకృతియైతగు
మరణభయాద్యఖిలదుఃఖ మగ్నునిఁజేయన్. 300

—♦ అహంకారకి ముక్తిలేదు ♦—

క. దురితమగు నహంకారము
పురుషునిగలఁగించి మదినిబొడవెడునకం
దారుకదు విలక్షణంబయి
వరలుచున్నట్టిముక్తి పదమించుకయున్. 301

—♦ అహంకారనిరాస ♦—

క. దురహంకారగ్రహముఁ
బురుషుఁడువిడివడినఁ జంద్రుపోలె విమలుఁడై

పరిపూర్ణానందుండయి
వరలుచు నిజరూపమొంది వర్ధిల్లుధరన్. 302

క. అతిమూఢ తామసాత్మక
మతిఁ బురమున సోహమను విమత్తతయువనిన్
స్థితిచెడి వినాశనముఁగను
నతనికి బ్రహ్మాత్మభావ మడ్డకఁగలుగున్. 303

సీ. ఘనమైనశక్తినిగ్రాలుచుండెడీ యహం
కార దుస్సహభుజంగంబువలనఁ
ద్రిగుణంబులనియెడు దిగులుఁగొల్పెడుమూఁడు
పడగలచేఁజుట్టఁబడి ప్రచండ
మగుశక్తిఁజేసి బ్రహ్మానందమయనిధి
తనయందు రక్షణఁగనుచునుండ
వేదసమ్మతమగు విజ్ఞానమను మహా
ఖడ్గంబునం బడగలను మూఁటి
గీ. నిరవశేషమ్ముగాఁదెగనటికి ఫణిని
సాంతముగడించుపడఁజేసి సౌఖ్యమునిడు
నీసదానందమయనిధి నింపుమీఱ
ననుభవింపస్థిరప్రజ్ఞుఁ డర్హుఁడగును. 304

చ. గరళపుదోషమెంతయినఁగాని శరీరమునందుఁజేరితా
స్థిరముగనిల్చునంతకును క్షేమమదెట్టులులేకయుండునా
తెలుఁగున గర్వలేశముమదిం గుదురొందిన నెట్టియోగసూ.
స్థిరమతియైనవానికిని దెన్నఁ గనంబడఁబోదుముక్తికై. 305

క. ప్రత్యక్తత్త్వము నెఱుఁగుట
నత్యంతనివృత్తిఁ గనెడి నహముననుమతి త
త్కృత్యములెల్లను బిమ్మట
సత్యమునేనైతినని సంపదగలుగున్. 306

సీ. వికృతాకృతులనొంది వెలయునట్టిదియును
నాత్మబింబంబునై యలరునదియుఁ
దనరూపమును జాటుగను జేయునదియును
వివిధకల్పనలను వెలయునదియు
నైనయధ్యాసను నవని చేతనరూప
మానందచిన్మూర్తివైన నీకు
జననంబు మృతియును జరయుదుఃఖము నాది
యగు పెక్కుదోసఁగుల నలరునట్టి

గీ. సతతసంసారబంధము సంభవించె
నట్టి కర్తను నేనను నహమునందు
నేను నాదను పెడబుద్ధిఁ బూనకెపుడు
వేడ్కఁద్యజియింపు ముక్తికై విబుధవర్య! 307

క. అవికారివి నిర్దోషివి
ధ్రువరూపవిశేషరుచిరతోషాత్ముఁడవై
భువి వెలుఁగు నిన్నహంకృతి
కవయక సంసారమన్యగతిఁ బొందదెటన్. 308

ఉ. కానభుజించుచోఁ దనకుఁ గంఠతలంబున ముల్లుపోలికన్
జానగు నీయహంకృతిని శత్రువుగాఁ దలపోసి జ్ఞాన ఖ

ద్గాన పమూలముం దునిమిక్రన్నన సంతతమిచ్చవచ్చిన
గ్లానుము సాక్షియైనపరమాత్మవిభుత్వసుఖామృతంబిలన్.

క. అనురాగాహంకారము
లను వదలి పరాత్మతత్వలాభమున సుఖం
బున నిర్వికల్పమతివై
పనుపడ మను సఖుఁడ! యెపుడు బ్రహ్మమునందున్.

చ. బలమగునీయహంకృతిని బట్టిసమూలముగాఁగఁగోసినం
దొలఁగకచిత్తమొక్క త్రుటిదోఁగుచుఁదిర్గిస్మరింపఁబూను-నోఁ
జెలఁగివిజృంభణమ్ముఁగొని చెచ్చెరవర్షమునందుగాలిచేఁ
జలనమునొందువారిదముజాడనుబెక్కువిధమ్ములొందెడిన్.

ఆ. ఎండునిమ్మ నీటి నివురొందునట్టులు
నరి యహంకృతమ్మునలరు విషయ
చింతనమునఁగానఁ జెలఁగినిగ్రహమొంది
విషయములఁదలంపు విడువవలయు. 312

ఉ. దేహమెయాత్మయానుమతిఁజరియించునతండు కామియా
దేహమునేనుగానను సుధీవరుఁడెట్టులు గామియయ్యెడున్
దేహముయాత్మయానను మదింజరియించెడివారి నర్థసం
దోహపరత్వమే భవముదోఁగెడిహేతువుభేదభావనన్. 313

—• కామ్యకర్మ విషయాభివృద్ధి •—

ఆ. కార్యవృద్ధివలనఁగాంచు బీజమువృద్ధిఁ
గార్యనాశనమునఁగలుగు బీజ
నాశనమ్ముగాన నయమునఁ గామ్యకా
ర్యములనెల్ల నడుపనగును విధిగ. 31

క. వాసనబహుళంబగుట వి
కాసముఁగను గామ్యకర్మ కార్యవికారస
ద్వాసనయుఁగల్గు దేహికి
బాసట సంసారమగుసు బాయకయెప్పుడున్. 315

ఆ. విపులకామ్యకర్మ విషయచింతనమున
నలరునట్టి వాసనాతిశయము
భవముఁగూర్చుఁ గానభవబంధముక్తికి
యతిదహింపవలయు నాద్వయమును. 316

— సర్వాత్మబుద్ధి వాసనాదిక్షయము —

క. సర్వత్ర సర్వదశలను
సర్వోపాయముల సర్వసమయములందున్
సర్వము బ్రహ్మంబని కను
సర్వోన్నతబుద్ధిఁ దొలఁగి చను నాత్రయమున్. 317,318

— వాసనాక్షయము జీవన్ముక్తి —

ఆ. కామ్య కర్మ లయముఁగాంచిన విషయాను
చింత తొలఁగుదానఁ జెచ్చెర నగు
వాసనాక్షయమ్ము వాసనలుడుగుట
మోక్షమదియు బ్రతుకముక్తి యంద్రు. 319

చ. ఇరులొగిదట్టమైవికసి యెక్కుడుభీతినొసంగురాత్రి యం
బరమణిపుట్టువుంగనుట బొగుగలీనమునొందునట్టులున్
నిరుపమమాత్మవాసన జనించి విజృంభణమొందునంతదు
ర్భరమగునీయహంకృతిసెబాసననాశనమొందునంతయున్.

ఉ. చీఁకటి చీఁకటింబడయుచెడ్డలు భాస్కరుఁడుద్భవింపనా
ధాకముఁ దాళలేకవడిడాగియకృత్యమునొందురీతిఁ దా
నేకత నద్వితీయత రహించెడుబ్రహ్మమునందుఁగల్గు న
స్తోకసుఖామృతమ్ముఁగొనదుఃఖముసంసృతినొందకుండెడిన్.

—♦ పరమాత్మచింతన వీడకుము ♦—

చ. వెలుపలలోపలంజెలఁగు విశ్వమునంతయు మిథ్యగాసదా
పలుకుచుఁ జిఘ్నంబయినబ్రహ్మను నిర్మలచిత్తమందు నం
దలఁచిసమాహితుండవయిదైన్యమునొందకపూర్వజన్మసం
కలన జనించుకర్మమునఁ గాలమునెట్టులొ నెట్టగాఁదగున్.

—♦ సనత్సుజాతవాక్యము ♦—

క. పరమాత్మనియతియందున
మఱపొందు టకృత్యమగును మహినీశ్వరుఁడౌ
పరమేష్ఠిసుతుఁడు విస్మృతి
నెరిమృతియని యాంబికేయనృపతికిఁజెప్పెన్. 323

—♦ బ్రహ్మనిష్ఠఁదప్పుట సర్వానర్థహేతువు ♦—

ఉ. జ్ఞానికి స్వస్వరూపమునుగాంచెడిచింతనమందు విస్మృతిం
బూనుటకన్నసన్యమగుపోడిమిఁదప్పు నవస్థయుండ ద
ద్దానను మోహముబ్బెడును దద్దయుదాన నహంబుగల్గెడిం
దానభవంబునొందెడిని తద్భవమొందుటదుఃఖమేర్పడున్. 324

—♦ విషయలోలుఁడు చెడును. ♦—

ఆ. విషయలోలుఁడైన విద్వాంసునేనియు
బుద్ధిదోషములను బొసఁగి మఱపు

చిక్కువెట్టు విషయచింతనాసక్తుఁడౌ
విటునిఁ జిక్కువెట్టు వెలఁదివోలె. 325

ఆ. త్రోసివేయనాచు త్రుటిమైననుండక
మరల నావరించు కరణి మాయ
బ్రహ్మనిష్ఠదప్పఁ బ్రాజ్ఞునినైనను
గప్పివేయుచుండుఁ గవిసికవిసి. 326

చ. కరమునఁ దప్పిజారిపడు కందుక మంతట మెట్లవెంబడిన్
వరుసనుదొర్లి భూతలముపైన దొరంగెడుభాతి లక్ష్యమున్
మరువఁగ బాహ్యసౌఖ్యముల మానసమంతటనంతకంతకున్
వెరవుదొరంగిసత్యముగ వేగ నధోగతి నొందు బండితా! 327

— ప్రమాదము మృత్యువు. —

ఉ. కాన సమాధినేమరుటకన్నఁ బరంబగుమృత్యువెద్దియుం
గానఁగరాదు, జ్ఞానియయి కాలెడుప్రాజ్ఞనకాత్మతత్త్వసం
ధానము లెస్సగంగలుగుఁ దద్దసమాహిత చిత్తుఁడైన న
ద్దాన సమాహితుండవయి తప్పక విస్మృతిఁ నొందఁబోకుమా!

— విషయచింత లోకబంధము. —

క. విషయములఁ దవిలి చిత్తము
విషయ గుణంబులను దలఁచు వేడ్కఁదలంపం
దృషవొడము పురుషునకు నా
తృషవలన ప్రవర్తనమ్ము దిటముగఁగల్గున్. 329

— విషయచింత మృత్యువు —

క. ఆకామ్యవర్తనము తన
యాకృతినాశనముఁజేయు నటులొంద నధో

లోకమునఁబడును పతితుఁడు
పైకెగయఁగలేదు మిత్తివాతంబడుటన్. 330

— భేదసంకల్పశూన్యుఁడు విదేహజీవన్ముక్తుఁడు —

క. ఆకారణమున దుర్గతి
కాకరమగు కోర్కి విడువ హా! ముక్తిపదా
చేకురు నుభయవిధంబులఁ
గా కన్యముగనినభయముఁగల్గించు శ్రుతుల్. 331

— భేదము భయహేతువు —

క. అనునయుఁడగుబ్రహ్మను బుధుఁ
డణుమాత్రము భేదమును బ్రమాదాదులచేఁ
గనుఁగొనినవేళ నాతని
మనమునభయమొదవు ద్వైతమతిచేవిబుధా! 332

— జగత్సత్యము దుఃఖకరము —

మ. శ్రుతిధర్మంబులన్యాయసమ్మతములన్ శుద్ధస్మృతిన్ యుక్తులన్
శతధా మిథ్యగఁద్రోసివేయఁబడునీసర్వమ్ము దానంచు మూ
ర్ఖత భావించు సతండు దుఃఖములపైఁగా దుఃఖజాలమ్ములన్
సతతంబుంగనుదూష్యకృత్యములునిచ్చల్సేయుమ్రుచ్చున్వలెన్

— ఆత్మచింతనము ముక్తి —

క. పరమాత్మచింతనవ్రత
పరుఁడగు ముక్తుండు నిత్యపదభాగ్యంబుం
దొరకొను మిథ్యాసక్తుఁడు
మరణించు నచోరచోరమానవులగతిన్. 334

—♦ యతికి మిథ్యాప్రసంగము తగదు ♦—

చ. యతి భవబంధహేతువగునట్టి యసత్యములందునాదియన్
మతివిడనాడి నేనుపరమాత్మగనై తీసటంచు నాత్మస
మ్మతిఁదగనుండఁగావలయు బ్రహ్మము నేనను బుద్ధిమాత్రదు
ర్గతులను గొట్టి సౌఖ్యమునుగల్గఁగఁజేసెడుఁ బండితాగ్రణీ!

—♦ బాహ్యచింతనము దుఃఖప్రదము ♦—

ఉ. కల్పితమైన బాహ్యతతిఁగాంచు నిరంతరమంతకంతకున్
స్వల్పముగాక దుష్టఫలసంతతి వృద్ధినొనర్చుచుండెడిం
గల్పితమీప్రపంచమని కాంచిసుదూరము నొందఁజేయుచున్
నిల్పుముస్వాత్మచింతనము నిచ్చలునిర్మలచిత్తమందునన్.

—♦ బాహ్యత్యాగము ముక్తిహేతువు ♦—

చ. అనవరతమ్ము బాహ్యవిషయమ్ములనడ్డుట నిర్మలమ్ముఁదాఁ
గనుహృదయమ్ము నిర్మలముగాంచినచిత్తము బ్రహ్మదర్శనం
బనుఘనభాగ్యమొందునది యబ్బుటసంసృతిబంధముల్ దెగుం
గనుకవిముక్తినొందఁదగుకార్యము బాహ్యనిరోధమైతగున్.

—♦ ప్రాజ్ఞుఁడు బాహ్యనిరోధి ♦—

క. సదసద్వివేకమొందియు
బుధుఁడై పరమార్థమెఱిఁగి భువిముక్తుఁడన
త్పదమెట్టులాశ్రయించును
మదినెఱిఁగియు శిశువుగతిఁబ్రమాదమునొందన్. 338

—♦ ముముక్షు వభిమానశూన్యుఁ డభిమాని ముక్తిశూన్యుఁడు ♦—

ఉ. ముక్తిఫలేచ్ఛకు దేహగృహముఖ్యములంగని మోహమెం
దనాసక్తిఫలేచ్ఛకు దేహగృహసంతతిముక్తి నిబొందువానికిన్

వ్యక్తిపాలికి నిద్రఁగను వానికి నిద్రపాలికి మేల్కొనన్
వ్యక్తులు రెండు భిన్నగుణబద్ధములై విలసిల్లుచుండుటన్.

—♦ తన్నుదానెఱుఁగుట ముక్తి ♦—

ఉ. సన్ననితంతుకైవడిని స్థావరజంగమజీవకోటులం
దన్నిట లోపలన్వెలిని నాశ్రయుఁడౌ తనునాత్మఁగాఁగ లో
నెన్నుచుఁ గాంచి శ్రోయఁబడునెల్లయుపాధులనేకరూపుఁడై
భిన్నములేక పూర్ణుఁడయి వెల్గునతండు విముక్తుఁడై తగున్.

—♦ బ్రహ్మనిష్ఠ సర్వాత్మభావము ♦—

ఉ. సర్వజగంబుఁ దాననుట సంసృతిబంధవిముక్తిహేతువౌ
సర్వజగంబు బ్రహ్మమను జ్ఞానముకన్న విముక్తినొంద నీ
యుర్వినుపాయమొండుగననొప్పదుదృశ్యమువీడి బ్రహ్మమున్
నిర్వికృతిన్ సదాకనిన నీయఖిలంబు సదాత్మయైతగున్.

—♦ మూఢుఁడు ముక్తిశూన్యుఁడు ♦—

సీ. అస్థిరంబగు దేహ మాత్మయౌ ననుభావ
మునఁ బ్రవర్తనమొందు మూర్ఖునకును
బాహ్యపదార్థానుభవమునఁ జొచ్చెడు
చిత్తముగలమూఢచిత్తునకును
బాహ్యసుఖములాసపడుచుఁ దత్కృత్యముల్
జేయుభావముగల చెనటునకును
దృశ్యమౌవిశ్వము దిగనాడు టేరీతి
సంభవంబగు బుధసత్తమ భువి

గీ. సర్వకర్మంబులను పేట్క సన్యసించి
బ్రహ్మనిష్ఠాగరిష్ఠులై పఱగి తత్వ

వేత్తలై నిత్యసుఖమొంద వేడ్కపడెదు
యతులకయ్యది సంభవమవురుగాని. 342

—♦ సమాధి సన్న్యాసములు యతిధర్మములు ♦—

క. శ్రుతివిహితకర్మఁజేసెడి
యతులకు సర్వాత్మసిద్ధియగుఁ బొంకెరు భువిఁ
"శ్రుతి శాంతోదాంతో" యని
సతతసమాధిని విధించె సమ్మతమునఁగఁ. 343

—♦ అహంకారము లౌకికదుర్జ్ఞేయము ♦—

గీ. నిర్వికల్పసమాధిని నిశ్చలాత్ము
లైన కవిత్జ్ఞులుగాక యన్యజనము
పాదుకొనియున్న నహము ద్రుంపంగఁగలరె?
వాసన లనంతభవముల వరలుచున్కి. 344

—♦ విక్షేపశక్తి చంచలము ♦—

క. ఆవరణశక్తిబలమున
భావముఁగలఁగించు గర్వభావమున భువిఁ
వే విక్షేపము పురుషుని
వేవిధములఁగలఁత వెట్టు వెంగలిగాఁగన్. 345

సీ. రహిఁబూర్ణమగు నావరణశక్తి దొలఁగిన
బ్రాపుదాఁవీడు విక్షేపశక్తి
పరమాత్మకును జూడఁబడు ప్రపంచమునకు
క్షీరసలిలమ్ముల చెలువు మెఱయ

వేఱుసేయుట నాత్మ వేడ్కఁ గాంచినతఱి
నంత యొందుఁదనంతనావరణము
మిథ్యార్థమగు పుత్రమిత్రవిత్తాదుల
హానిలాభంబులయందుఁ బూని
గీ. హర్షశోకాదులేక తఱినంటకుండు
నపుడు పురుషుండు నిస్సంశయమ్ముగాఁగ
నెట్టి విఘ్నంబులును లేక హితముమీఱ
నిర్వికల్పసమాధిని నిశ్చలుఁడగు. 346

—♦ వివేకము భవభంజనము ♦—

క. పరమాత్మ నిష్ప్రపంచముఁ
బరికించియు వేఱొనర్చి పటుసద్బోధన్
వరలిన జ్ఞానము మాయను
బరగిన మోహమునుద్రుంచి బంధముఁద్రెంచున్. 347

—♦ ముక్తుఁడు భవశూన్యుఁడు ♦—

క. జీవేశ్వరులొక్కండను
దావాగ్నిఁద మోహవనమ్ము దగ్ధంబగుచోఁ
గైవల్యపదమునొందఁగ
నేవిధి సంసారబీజమీతని నొందున్. 348

—♦ జ్ఞానమున నావరణాదులు నశించును ♦—

క. స్థిరమైన సద్వివేకము
బరగిన నావరణమెల్లు భ్రమమెల్లెడు దు
ష్కరవిక్షేపము కతనన్
వరలెడు దుఃఖములుఁబోవు వాస్తవమిదియౌ. 349

—♦ జ్ఞానము నివృత్తిహేతువు ♦—

గీ. త్రాటిరూపమ్ము బాగుగఁదనక్షుఁదెలియ
నీత్రయమ్మెడబాయును నిశ్చయముగఁ
గాన బంధవిముక్తికి జ్ఞానియెపుడు
వస్తుతత్త్వవివేకముఁ బడయవలయు. 350

—♦ ఆవరణాదులు కల్పితాసత్యములు ♦—

చ. ఇనుమనలంబునంగదిసి యెంతయుఁ దేజము నొందురీతినిర్
మనసుసదాత్మతోఁగలిసిమాతృముఖాది జగద్విజృంభణం
బునుగొనుభ్రాంతిస్వప్నముల బుద్ధికృతంబులసత్యమైనటుల్
గనుఁగొననీత్రయమ్ముమృషగాజనుజాగ్రదవస్థయందునన్.

—♦ పరమాత్మ సత్యము ♦—

చ. మొనసిచెలంగు నీయహముమున్నగు దేహముతోడనంత
ము।గనువిషయమ్ములన్నియు వికారములయ్యెడుమాయకున్
క్షణ।క్షణమున మార్పునొందునివిసత్యములై తనరారవెప్డు
మా।ర్పునుగన కెప్పుడేనియునుబొందుగ వెల్గెడునాత్మసత్యమై.

—♦ దృక్పదార్థ వర్ణనము ♦—

ఉ. నిత్యుఁడఖండుఁడద్వయుఁడు నిర్మలుఁడాద్యుఁడు సాక్షి
రూపుఁడున్
సత్యమసద్విలక్షణుఁడు సర్వజగన్మయుఁడేకరూపుఁడున్
స్తుత్యుఁడహంప్రతీతిగనుదోఁచు పదార్థము నిర్వికారుఁడ
ప్రత్యయరూపుఁడై వెలుఁగు బ్రహ్మముదానిలనెల్లవేళలన్.

—♦ బ్రహ్మవేత్త ముక్తుఁడు ♦—

గీ. ఇట్లుదృగ్దృశ్యముల భిన్నమెంచి తత్వ
నిశ్చయమ్మున నద్వయనిర్వికార
మైన పరమాత్మనేనని యరసి వేత్త
స్వయముగా ముక్తుఁడై వేడ్క శాంతినొందు. 354

—♦ ఆత్మదర్శన మజ్ఞాననాశనము ♦—

క. ఎపుడవికల్పసమాధిని
నపరిచ్ఛేదాత్మతత్వ మరయంబడునో
యపు డజ్ఞానధ్వాంతము
లపగతమగుఁ బూర్ణలయమునందుచు వేగన్. 355

—♦ నిర్వికల్పసమాధి నిత్యానందము. ♦—

మ. మతిదోషంబున నీవు నేను మఱియీమాయాప్రపంచంబునా
నతిమోహంబుజనించుచున్నది పరంబద్వైతసద్బ్రహ్మనం
చితమౌరీతి సమాధిఁగాంచుటను నిశ్శేషంబుగా నెల్లవై
కృతులున్నాశనమొందునిక్కముగ నెంతేధీరశిష్యోత్తమా!

—♦ జ్ఞాని బ్రహ్మస్వరూపుఁడు ♦—

సీ. శాంతుండు దాంతుండు సహనసమేతుండు
నుపరతి నెక్కుడు నొందువాఁడు
సర్వకర్మంబుల సన్యసించునతండు
ముక్తిఁగాంచఁగల ముముక్షువగుచు
నిర్వికల్ప సమాధనిష్ఠను గడియించి
తనసర్వతాభావమును సతంబుఁ
జింతనసేయు నాచింతన కతమున
నజ్ఞానతిమిరచయమ్మునఁగల

గీ. దొసఁగులెల్లను లెస్సగాఁ దోలి యే వి
కారములఁ జిక్కఁగాంచక కామ్యశూన్యుఁ
డగుచుఁ బరమాత్మరూపుఁడై యతిసుఖమ్ము
నొంది యానందమును సదా చెందును యతి. 357

—♦ సర్వసంగపరిత్యాగమే జీవన్ముక్తి. ♦—

ఆ. శ్రవణమాదలైన జ్ఞానేంద్రియమ్ముల
సహముఁ జిత్తమును జిదాత్మ నునిచి
తగసమాధి నొందఁ దనరు మోక్షం బన్య
కథలవలన ముక్తిఁగాంచ రెవరు. 358

—♦ జ్ఞాని భేదశూన్యుఁడు ♦—

చ. చెలఁగియుపాధిభేదములఁ జెందును భేదముఁ దాస్వయంబుగం
దొలఁగ నుపాధులొప్పుగను దోఁచు నొకండుగ భేదమొందకా
వలన విపశ్చితుండిల నుపాధిలయంబొనరింప నెప్పుడుం
జలనమునొందకుండఁగ బ్రశస్తసమాధిఁ జరింపఁగాఁ దగున్.

—♦ ఆత్మచింతన బ్రహ్మత్వసిద్ధి ♦—

క. తుమ్మెదకన్నను వేఱయి
తుమ్మెదయగుఁబురుగు భీతిఁ దుమ్మెదఁ దలఁపన్
సమ్మతి బ్రహ్మముఁ దలఁచిన
నిమ్మహి బ్రహ్మత్వమొందు నీనరుఁడు బుధా! 360

చ. ఇతరవిలాసమెంచ కళి నెంచుచుఁ గీటకమాయళిత్వమున్
బుతముగ నొందు రీతిని ద దేకమనోనియమత్వదృష్టి ను
ద్ధతపరమార్థతత్త్వమును ధ్యాన మొనర్చిన బ్రహ్మరూపమున్
సతతముఁ గాంచు యోగిజనసత్తముఁ డన్యగతిం జరింపమిన్.

—♦ స్థూలదృష్టి కాత్మసిద్ధిలేదు ♦—

ఆ. మఱియుసూక్ష్మమైన పరమార్థతత్వము
స్థూలదృష్టినొంద వీలులేదు
తగుసమాధి సూక్ష్మదర్శనులగుపండి
తార్యజనులవలననరయఁబడును. 362

—♦ ఆత్మచింతనమున బ్రహ్మత్వసిద్ధి ♦—

క. కనకము పుటములశుచియయి
కనలుచుదోషములఁబాసి క్రాలెడుకరణిన్
మన మాత్మచింతనమునన్
గుణదోషమువీడి బ్రహ్మగుణములనొందున్. 363

గీ. అత్మచింతనవశమున నమలమగుచు
మనసు బ్రహ్మను లయమయి ప్రాన్పడంగ
నద్వయానందరసమును నందఁజేయు
నిర్వికల్ప సమాధాననియతిగల్గు. 364

—♦ స్వరూపసిద్ధి నిర్వికల్పసమాధినగు ♦—

క. ఈ యవికల్పసమాధిని
బాయును గామ్యాదిబాహ్యవాసన లింకన్
వేయి శుభాశుభకర్మలు
సేయత్నములేకబ్రహ్మ నెఱుఁగుటకలుగున్. 365

—♦ నిర్వికల్పసమాధి సర్వోన్నతము ♦—

గీ. శతగుణంబగు మననము శ్రుతులకన్న
మననమునకన్న శ్రద్ధయు ఘనముమిగుల

నిర్వికల్పసమాధి యన్నింటికన్న
నధికమైనఫలమ్మన నలరునెపుడు. 366

గీ. నిర్వికల్పసమాధిని నిశ్చయముగ
బ్రహ్మతత్వమ్ముఁగనుఁగొనఁబడుట సత్య
మన్యమునలేదు చంచలమగుటమనసు
ప్రత్యయాంతరమిశ్రమై బ్రహ్మముండు. 367

ఉ. కానకతీంద్రియుండవయిగ్రాలుచు నిర్మలమైనచిత్తముం
బూని ప్రతీచుఁడైన పరిపూర్ణునియందు నిరంతరమ్మసం
ధానుఁడవై పరాత్పరునితత్వముఁగాంచుచు నాదిలేని య
జ్ఞానసమావృతాత్మతమసత్వమునాశన మొందఁజేయుమా.

— యోగసాధనములు —

ఆ. ప్రథమసాధనమ్ము వాఙ్నిరోధ మ్మటు
పైన నిగ్రహమటుపై నిరాశ
పిదపఁగోర్కెలేమి పిమ్మట నేకవా
సమ్ము యోగమునకు సాధనములు. 369

— నిర్వికల్పసమాధి బ్రహ్మానందము —

సీ. ఏకాంతసంవాస మింద్రియమ్ములనిరో
ధమునకు హేతువు దమమరియగు
దమము చిత్తము నిరోధము సేయఁగారణ
మదియ శమంబన నలరుచుండు
శమమున నహమును శాంతినిబొందెడు
శాంతినహమునొంద సంతతమ్ము

జ్ఞానవంతునకు బ్రహ్మానందరసభూతి
యొనగూడుచుండు నట్లొనరు కార
గీ. ణమున మనసాత్మునకుఁ జిత్తదమము సేయ
ననుదినంబును యత్నమునొనరుపఁ దగు
నిదియ యోగాత్ములకుఁ దగుపథమరయఁగఁ
బరమతత్త్వార్థ సంశీల! బ్రహ్మవేత్త! 370

—♦ జీవేశ్వరైక్యము క్రమానుగతము ♦—

చ. మనసున వాక్కు నుంచి తగ మానసవృత్తిని బుద్ధియందునం
జొనుపుచు బుద్ధినిన్నతముఁ జూచెడి జీవునియందుఁ గూర్చి జీ
వుని శుచినిర్వికారుఁడగు పూర్ణపరాత్పరునందుఁ జేర్చి లో
నెనగనరాని శాంతగుణమెంతయునొందిసుఖించుచుండుమా.

—♦ జ్ఞానికి సమాధిహీనత యనర్థహేతువు ♦—

గీ. అంతరింద్రియసంబంధమైన దేహ
బుద్ధిజీవేంద్రియాదుల పొత్తువలన
విషయమోహమ్ములును రూపవిస్మృతియును
గరముజ్ఞానికిఁ దద్గుణగతులఁగల్గు. 372

—♦ చిత్తనిరోధము యతిధర్మము ♦—

ఆ. ఆయుపాధిచింత లడఁగుటవలనను
మునికిసకల విషయములఁగనంగ
నుపరతమ్ము సౌఖ్యమొసఁగు సదానంద
రసమునను భవించు ప్రాప్తిగలుగు. 373

—♦ విషయవిరక్తుఁడు విరాగి ♦—

గీ. ముక్తిపైఁగోర్కి వలన విరక్తినొంది
బాహ్యసౌఖ్యమ్ములను మనోవాసనలను
వీడు వైరాగ్యమునఁగడు వేడ్కనొందు
వాఁడు బాహ్యాంతరవ్యాప్తివర్జితుఁడయి. 374

క. పరమాత్మ నిష్ఠనొందుచు
విరతుండగునతఁడు బాహ్యవిషయములందున్
మఱియహమాదుల యందునఁ
బరగెడు సంగమునువిడువఁ జటుశక్తుఁ డగున్. 375

—♦ జ్ఞానవైరాగ్యములు ముక్తిప్రదములు ♦—

చ. పులుఁగునకొప్పుఱెక్కలుగ బోధవిరక్తులు రెండుపుంగవుం
డెలఁగితరింపఁజేయునని చిత్తములోన నెఱుంగుమీవు న
ప్పులుఁగునకుండుపక్షములుపొందుగనుండకయున్ననొంటిమై
బలమున ముక్తిసౌధమునఁబైకొనలేవియ నెక్కనే బుధా!

గీ. తీవ్రవైరాగ్యమున సమాధియు సమాధి
వలన జ్ఞానమ్ము జ్ఞానమ్మువలన లెస్స
భవవిముక్తియు గూఱియునాభవవిముక్తిఁ
బడయ నిత్యసుఖానుభవమ్ము గల్గు. 377

సీ. వనితా సుతాదులఁగని సుఖభ్రాంతిని
మోహముంగనివృథా మోటువడని
వశ్యమానసునకు వైరాగ్యమునకన్న
నతిసౌఖ్యకరమగు నదియుఁగాన
మావిరాగము శుద్ధమగు నాత్మబోధమైఁ

దనరస్వారాజ్యామృతమ్ము నొసఁగు
నీజ్ఞానవైరాగ్య మెలమి శాశ్వతముక్తి
కాంతకు ద్వారమై క్రాలుచున్కి
గీ. నన్ని యెడలనిరీహవై యలరినీవు
సంతతానందమయ సర్వసాక్షియందుఁ
జెలఁగినిత్యవిభూతిని జెందుఁ బొంచె
నిర్వికల్పసమాధిని నెరపుమెపుడు. 378

—♦ బ్రహ్మనిష్ఠ నిత్యానపాయిని ♦—

సీ. విషయాశమృత్యువై వెలయుచునుండుట
విషముతో సమమగు విషయములను
జెలఁగుదురాశను ఛేదించిసతతము
వర్ణాశ్రమాచారపద్ధతులను
దనరెడునభిమానమును వీడి తత్కార్య
ములగౌరవాదులఁ దొలఁగఁజేసి
యనృతాత్మకంబయి యలరు దేహాదుల
నభిమానమును వేడ్క నవలఁద్రోసి
గీ. బుద్ధిపరమాత్మయందునఁ బొందుపరపు
మీవు ద్రష్టవు నిర్మలభావుఁడవును
వాస్తవంబుగ నద్వయబ్రహ్మవైతి
వనుచు నెమ్మనమందున నరసి యెపుడు. 379

—♦ బ్రహ్మనిష్ఠ నిత్యసౌఖ్యము ♦—

సీ. నిరుపాధికంబుగా గుఱియైనపరమాత్మ
యందుఁ జిత్తమ్మును బొందుపరచి

బాహ్యేంద్రియమ్ముల వరుసనన్నింటిని
దమతమనెలవులఁ దనరఁజేసి
స్థిరశరీరుఁడవయి దేహస్థితినిఁగోసి
పరమాత్మతానను భావమొంది
బ్రహ్మాత్మభావము పరిఢవిల్లనఖండ
మైనధర్మంబున నలరిమిగులఁ

గీ. బరమసంతోషమునఁ బరబ్రహ్మసుఖము
ననుభవింపుము నీయందు నన్యములగు
శూన్యమైనట్టి శ్రమలచేఁ జూడనేమి
లాభమొదవును కనుఁగొను లక్షణముగ. 380

—♦ బ్రహ్మచింత ముక్తికారణము ♦—

క. పాపములకు గుఱియయి కడుఁ
దాపములకు హేతువయిన తనుభావము నీ
వేపునవిడిచి విముక్తికిఁ
బ్రాపగు పరమాత్మ నెపుడు భావించు మెదన్. 381

—♦ బ్రహ్మచింత నిత్యముసేయుము ♦—

చ. సకలజగద్విలాసమున సాక్షిమయుండయి స్వప్రకాశమై
యకలుషమూర్తిశోభనహరహంబును ధీగుహ వెల్గుచుండునీ
ప్రకటితమైన బ్రహ్మమును భావమునం గుఱినిల్పి చిత్తమే
వికృతులఁగుచ్చ కాత్మనిలవేడ్క విచారణసల్పుచుండుమా!

—♦ స్వస్వరూప మాత్మ సాక్షాత్కారము ♦—

క. భావాంతరములఁబూనక
నేవిధులను నాత్మఁగనక నీపరమాత్మన్

శీవిగ ననవరతము స
ద్భావముఁ నక్స్పష్టముగను బరికింపఁదగుఁ. 383

—♦ ఉదాసీనత ఉత్తమధర్మము ♦—

గీ. సాక్షియగునీచిదాత్మను సర్వగతుల
నాత్మభావమ్ముఁదానెంచి యహము మొదలు
తత్వములనాత్మబుద్ధిని దగులఁబోక
యవిసిపోయిన ఘటములయట్టులుండు. 384

—♦ తన్నుదానే యెఱుఁగవలయును ♦—

ఉ. జ్ఞానమయస్వరూపుఁడునఁసాక్షియునైనచిదాత్మయందునిం
పూనవిశుద్ధమానసమునుంచి కడుంగడుమెల్లమెల్లఁగా
మానసమందుస్థైర్యమునుఁబ్రాప్తఁజేయుచునంతమీఁదటం
బూనికమీఱ విశ్వపరిపూర్ణునిదన్నెఱుంగఁగాఁదగుఁ.

—♦ ఉపాధిరహితాత్మ పరిపూర్ణము ♦—

క. తనమూఢతచేఁగలిగిన
తనుముఖ్యములౌ నుపాధితతివిడిచిన యా
త్మను నంబరమ్మువలెఁ బూ
ర్ణునిగ నఖండస్వరూపునుంగాఁ గనుమా. 386

—♦ ఉపాధిరహితబ్రహ్మ మొక్కఁడే ♦—

చ. కలశముసూదికుంభమునఁగంపయుమున్నగువస్తుజాలముల్
దొలఁగిన లోనియాకసమదొక్కటియైనటుగావిమూఢతం
గలిగిన బుద్ధ్యహంకృతులుకాయమునింద్రియముల్నశింపని
ర్మలపరిపూర్ణమైనపరమాత్మయుఁబెక్కులుగాకనొక్కఁడే.

—♦ ఉపాధులు కల్పితములు, ఆత్మ పరబ్రహ్మము ♦—

గీ. నలువమున్నగ నల్లతృణంబుదనుక
సకలవస్తుస్వరూప మజ్ఞానకల్పి-
తమ్ముగానొప్పఁ దనయాత్మ ద్వైతశూన్య
మైనపరిపూర్ణుఁగా మది నరయఁదగును. 388

—♦ భ్రమ రహితవిశ్వము బ్రహ్మము ♦—

చ. భ్రమబొడగానఁగాఁబడిన వస్తువు తద్భ్రమబోవునంతటన్
భ్రమకునివాసమైతనరు వస్తువుగాని మఱొండుగాదు స
ర్పమనితలంచుత్రాఁడుభ్రమవాసినద్రాఁడగునట్లువిశ్వమున్
భ్రమదొలఁగంగనీమదినిబ్రహ్మమయంబుగనెంచుమోబుధా!

—♦ సర్వముఁదానె తనకుభిన్నములేదు ♦—.

క. తానజుఁడు తానెవిష్ణువు
తానింద్రుఁడు తానుశివుఁడు తగనీజగముం
దానగు భిన్నముకొంచెం
బేనియుఁ దనకంటెనుండ దెచ్చోనయినన్. 390

ఉ. తానె మనఃప్రపంచమునఁ దానెజగింబును స్థూలమంతటం
దానె పురోపకంఠమునఁ దానె యుదీచిని బశ్చిమంబునం
దానె యవాచిభాగమునఁ దానెపయిన్మఱిక్రిందనంతటం
దానెవిభిన్నరూపముగుద్రవ్యమొకండిలలేదుతాఁగనన్ 391

గీ. అలలు సుళ్లును నురుగుబుడ్గలు మొదలగు
సముదయంబెల్ల నిజమునజలమగు నటు
దేహమహమాదులన్నియు స్థిరతరముగ
నద్వయాఖండపరిశుద్ధమైన యాత్మ. 392

—♦ మాయాభ్రాంతుఁడు భిన్నవాది ♦—

సీ. వాఙ్మనంబులకు సంబంధమై నిత్యము
పరికింపఁబడు నీప్రపంచమెల్ల
బ్రహ్మస్వరూపమ్ము ప్రకృతికతీతమౌ
స్థానంబునందున్న సత్తుకన్న
నన్యమొక్కటిగన నఖిలలోకంబులఁ
గనరాదు కుంభము ఘటముకలశ
మాదియౌ సకలపదార్థసంతతియును
మృత్పరార్థమ్మున కితరమగునె
గీ. మాయయనునట్టి సురను సంభ్రాంతుఁడగుచు
నరుఁడు నిజమునవిడనాడి తెరువుఁగనక
భేదమగుబుద్ధి నంతయు భిన్నమనుచుఁ
బల్కెడును నేననీవని పందయగును. 393

—♦ వేద మద్వైతమును బోధించును ♦—

క. పరమాత్మవిషయమై శ్రుతి
పరమేయదిలేదటంచుఁ బల్కుచు నెపుడున్
మఱి మఱి యద్వైతంబును
బరువడి వాక్రుచ్చుచుండెఁ భ్రమదొలఁగుటకై. 394

—♦ సర్వము పరబ్రహ్మస్వరూపము ♦—

చ. గగనము భాతి బ్రహ్మము వికల్పములేనివినిర్మలమ్ము నే
వగఁగనరాని దక్రియముఁ బారములేనిది లోనవెల్పలం
దగఁగనలేని దన్యమగుతత్త్వములేనిది ద్వైతశూన్యమై
తగునది గానబోధ్యమిఁకఁదద్దయు దెల్పఁగలేదొకింతయున్.

—♦ వేదానుభవములు సర్వముబ్రహ్మగాఁదెల్పును ♦—

సీ. పరమాత్మవిషయమన్మ బహువిధమ్ములఁదెల్పఁ
బనిలేదు జీవుండు బ్రహ్మమ యగు
నతివిశాలంబగు నట్టినీసర్వప్ర
పంచజాలమ్మును బ్రహ్మమయగు
నిల "నేకమేవాద్వితీయంపరబ్రహ్మ"
మనిశ్రుతు ల్సర్వదా పలుకుచుండు
దారాసుతాదులఁ దగవిడనాడియు
నేనుబ్రహ్మంబను జ్ఞానమొందు
గీ. నట్టివారలు బ్రహ్మత్వమంది నిత్య
సచ్చిదానందరూపులై సంచరింతు
రవని నవ్వారి జ్ఞానమ్ముధ్రువము సుమ్ము
వినయగుణధన్య! తత్త్వవివేకమాన్య! 396

—♦ నిత్యానందబ్రహ్మము నీవకాఁదలంచుము ♦—

చ. మలమయమైనదేహమున మానుము నేనను బుద్ధిబుద్ధినిం
గలుగుదు రాశఁబిమ్మటను గాలివలెన్ క్షణభంగురమ్ముఁజం
చలమగులింగదేహమునఁ జయ్యనవీడుము వేదవేద్య ని
శ్చలుఁబరమాత్ము నేననువిచారణనుండుము బ్రహ్మమూర్తివై.

—♦ శ్రు॥ ధర్మభావన ముక్తియని చెప్పుచున్నది ♦—

చ. వీనుఁగువంటిదేహమును బేర్మినరుండు భజించునంతకుం
దాననఘుండుగాక భవతప్తుఁడగుం బరదుఃఖమొందు నీ
శానుఁగశుద్ధమూర్తిగ నచంచలుగాఁదనుగాంచు నాతఁడిం
దాను విముక్తినొందుభవతప్తుఁడుగాకని తెల్పె వేదముల్.

—♦ వస్తునిరాస బ్రహ్మజ్ఞానము ♦—

క. తనయాత్మయందు నారో-
పణమొందు సమస్తవస్తుభాసనిరాసం
బనఁ బెవియుఁగొనక యద్వయ
తను సంతతనిండుబ్రహ్మతానై చెలఁగున్. 399

—♦ నిర్వికల్ప సమాధి భేదరహితమైనది ♦—

క. తనుముఖ్యంబుల వేఱయి
ఘనతవికల్పములఁదొలఁగి గ్రాలుసదాత్మన్
మనమున్నతఱి వికల్పం
బొనరదొకండైనఁ గల్పనోక్తియమిగులున్. 400

—♦ సర్వాగతుల బ్రహ్మ మభేదము ♦—

క. ఒకఁడగుపరమాత్మను నీ
సకలవికల్పన మసత్యసామ్యముగను నీ
యకళంకు నిరాకారుని
వికృతిరహితుభేదమెట్లు వెలయుచునుండున్. 401

గీ. కనెడువాఁడును గనుటయుఁ గాంచఁబడున
దనెడు భేదములేకయేకాత్మమైన
నిష్కళంకు నిరాకారు నిర్విశేషు
భేదమేరీతి జనియించి వెలయుచుండు. 402

క. ఆకారవికారమ్ములు
ప్రాకృతభేదములు గనక ప్రళయార్ణవపున్
జోక నితాంతుని బూర్ణుని
నేకాత్ముని యందుభిన్నమెట్లుజనించున్. 403

గీ. వెలఁగి తేజస్సులోపలఁ జీఁకటివలె
భ్రాంతికారణతమ మదే బ్రహ్మమందు
నడఁగియుండునో యట్టియద్వైతనిర్వి
శేషపరతత్త్వమున వేఱె వెలఁగు టెట్లు ? 404

క. ఆనందమిడుసుషుప్తిని
బూనినతేఱి భేదమెవఁడుం బొందనిగతి ని
త్యానందు నద్వితీయుని
జ్ఞానాత్ముని భేదమెట్లు జనసము నొందున్. 405

—♦ పరమాత్మను జగత్తులేదు ♦—

చ. గుణమునఁ జూడగాఁ బడినకూడలియున్ మృగతృష్ణికమ్ములం
గనఁ సలిలమ్ము మూఁడయిన కాలములందున లేనిరీతినిన్
ఘనపరతత్త్వబోధను వికల్పవిహీనుఁడు సత్స్వరూపుఁడై
తన రెడు బ్రహ్మమందవనిఁ దథ్యముగాఁ గనలేకయుండెడిన్.

—♦ ద్వైతాద్వైత విమర్శనము సుషుప్త్యనుభవము ♦—

క. ద్వైతము మాయామయ మ
ద్వైతము పరమార్థ మనుచుఁ దగునటులు శ్రుతుల్
ఖ్యాతిగఁ దెల్పెడు నదియను
భూతమ్మగు గాఢనిద్రఁ బొందిన వేళన్. 4(7

—♦ వికల్పము భ్రాంతిజనితము ♦—

గీ. బుధులధిష్ఠానమున వేఱుఁ బొందకునికి
భ్రాంతిచేతను రజ్జుసర్పమ్ములందుఁ
జెలఁగు సర్పము ద్రాడుగాఁ దలఁచుచుండ్రు
కన వికల్పము భ్రాంతిజీవనమగుటను. 408

—♦ చిత్తలయము భ్రాంతి వికల్పశూన్యము ♦—

క. చిత్తము కల్పన మూలము
చిత్తములయమైన భ్రాంతిచెడియెడు కతనన్
సత్తగుబ్రహ్మమునందునఁ
జిత్తములయ మొందఁజేసి చెలఁగుమువత్సా! 409

—♦ బ్రహ్మనిష్ఠుఁడు బ్రహ్మసాక్షాత్కారి ♦—

చ. నిరుపమమూర్తినిష్ఫలుఁడునిత్యుఁడుముక్తుఁడునిర్వికల్పుఁడు
న్నిరవధిపుష్కరాభుఁడునునిత్యనిరీహుఁడునిర్మలాత్ముఁడున్
సురుచిరబోధరూపుఁడును శోకములేని సుఖాత్మకుండునై
పరగెడిబ్రహ్మ నొప్పుగను బ్రాజ్ఞుఁడుగాంచు సమాధినిన్మదిన్.

ఉ. కారణకార్యభావములఁగాంచక కల్పనలందు నెన్నఁగా
మీఱుచు నిర్వికారము నమేయమునై నిగమప్రసిద్ధమై
పారములేనిదై సతతభాసితమై తనుగాఁ బ్రసిద్ధినిం
పారెడు బ్రహ్మపూర్ణుని సమాధి నెదన్ బుధుఁడొప్పఁగాంచెడిన్.

చ. జరయును జావులేనిదియు శాంతమనాదియు శబ్దశక్తికిం
జొరనిది నిశ్చలాబ్ధిగతిసొంపుగ నుండియు నేకరూపతన్
స్థిరతరవస్తువై నదియుఁ జెన్నగ దోషగుణాళిఁదుల్యమై
పరగెడి బ్రహ్మనొప్పుగను బ్రాజ్ఞుఁడుగాంచు సమాధినిన్మదిన్.

—♦ పరబ్రహ్మజ్ఞత ధన్యత్వము. ♦—

చ. తగమనమున్సమాధినిడి తత్త్వమునందు నఖండవై భవుం
డగుపరమాత్మనుంగని బుధాగ్రణి పూర్వభవంపువాసనల్
దగిలిన భీమపాశమున స్థానమొసంగక త్రెంచివైచి నీ
వాగిసుఖ మొందిపౌరుషము నొప్పుగ సార్థక మొందఁజేయుమా!

—♦ పరబ్రహ్మభావనము భవనాశనము ♦—

చ. పడపడియెల్లవేళల నుపాధులనెల్లఁ ద్యజించిసర్వదా
సదమలమూర్తియై తనరి సంతతమోదమునందు నద్వయున్
హృదయతలస్థితంబయిన యీశ్వరుఁ జింతనసేయుచున్నదు
ష్పదమగు ఘోరసంసృతిని బొల్పడకుండువుతిర్గియెప్పుడున్.

—♦ సమాధిమంతుఁడు విడచినదేహస్మరణ సేయఁడు ♦—

చ. పొలుపుగఁ బూర్వకర్మఫలభోగమునం బ్రతిబింబరూపునం
దలఁపడినీడపోలికను దద్దయు దేహికిదృశ్యమానమై
చెలఁగుచుఁ బీనుఁగుంబలెను జెంగటనుంచక ద్రోసివేయునీ
మలినశరీరముందలఁపమానుమహాత్ముఁడుచిత్తమందునన్.

—♦ త్యాజ్యదేహము స్మరణానర్హము ♦—

ఉ. శాశ్వతమున్వినిర్మలము జ్ఞానము మోదమయస్వరూపమా
నీశ్వరుఁజిత్తమందునిచి యీజడరూపమలాన్వితమ్మునుణా
నశ్వరమంచు వేవిడిచి నమ్మకుమింకస్మరింపఁబోకు నీ
వీశ్వరమూర్తివౌటగ్రహియింతురెక్రక్కినదాని నెవ్వరుణా?

—♦ జ్ఞాని సమాధిమంతుఁడు ♦—

ఉ. ప్రాపునువీడి యీజడభువంబును మూలముతోడఁగూడస
ద్రూపమునిర్వికల్పమునురూఢము బ్రహ్మశుచిన్వెలార్చియే
తాపమునొందఁబోక పరతత్త్వముఁగాంచుచు నిత్యశుద్ధబో
ధాపరమోదితాత్ముఁడయి తత్త్వవివేకి చెలంగుచుండెడిణా.

—♦ జ్ఞాని దేహరక్షణమునుస్మరింపఁడు ♦—

మ. అమితానందరసస్వరూపుఁడగుబ్రహ్మన్లీనమై వేత్త ప్రా
క్తమకర్మంబనుత్రాటఁగట్టఁబడుగాత్రంబుండినంబోయినణా

భ్రమ నద్దానిస్మరింపఁబోఁడుమరలన్ భద్రానకై గోవు, కం
ఠమునంగట్టినమాలవోయిననునుండంగాంచఁబోనట్లుగన్.

—♦ జ్ఞాని దేహపోషణఁగోరఁడు ♦—

గీ. అద్వయానందమయరూపమయినయాత్మ
స్వస్వరూపంబుగాఁ గను జ్ఞాని దేని
గోరియెవ్వానిఁబొంకెను గూర్మిమీఱ
శాశ్వతంబని తనువును సాకుచుండు! 419

—♦ బ్రహ్మవేత్తకుబ్రహ్మానందమేఫలము ♦—

క. మానుగ జీవన్ముక్తుఁడు
జ్ఞానియు నగుయోగికెపుడుసంతస మలరన్
లోన బహిర్భాగంబున
నానందరసంబుఁగ్రోలుటదియెఫలంబౌ. 420

క. జ్ఞానము విరాగఫలమగు
జ్ఞానమునకు నుపరతియప్రశస్తఫలంబౌ
మానుగ నుపరతికిందగ
స్వానందమువలన శాంతినందుటఫలమౌ. 421

—♦ జ్ఞానవైరాగ్యోపరతిశాంతులు ముక్తిప్రదములు ♦—

గీ. ఉత్తరోత్తరగుణముల నొందకున్నఁ
బూర్వపూర్వమ్ములను ముక్తిఁబొందఁ దగదు;
బాహ్యవిక్షేపములనీడఁ బరమతృప్తి
సాటిలేనిసుఖంబును సంభవించు. 422

—♦ దుఃఖభయాదిశూన్యము జ్ఞానఫలము ♦—

చ. భ్రమజనియించు వేళబహుభంగులనింద్యపుఁగర్మ సేయునా
భ్రమదొలఁగంగ జ్ఞానమునఁ బందయునాపని సేయకుండుని
త్యముగనుదుఃఖపుంజములయందుభయమ్మునుదొట్రుపాటునొం
దమియఫలమ్ముప్రస్తుతముతత్త్వవివేకమునొందువానికిన్. 423

—♦ జ్ఞానికి నివృత్తియే ఫలము ♦—

ఉ. జ్ఞానఫలమ్ము మిథ్యయగుసర్వజగద్గుణసన్నివృత్తి యజ్ఞ
జ్ఞానఫలమ్ము సంతతముసంసృతిఁజొక్కుచునుంట జ్ఞాని వి
జ్ఞానుల నెండమావులప్రశంసను దగ్గతులెంచకున్న చో
జ్ఞానులనింతకంటెఁగన సత్ఫలమెద్ది రహించుబాడితా? 424

—♦ అజ్ఞానరహితనిష్కామి సంసృతిశూన్యుఁడు ♦—

గీ. మూఢమానసమని యెడిముడిని లెస్స
వీడ నిష్కామి నెటులుప్రవృత్తియందు
జడములైనట్టి విషయముల్స్వయముగ భువిఁ
గారణంబులుగాఁ గ్రాలికలఁతవెట్టు. 425

—♦ జ్ఞానవైరాగ్యోపరతిసీమ ♦—

ఉ. భోగ్యములందుఁగోర్కిమదిఁబుట్టకయుండినకాలమందువై
రాగ్యపుమేర నేననెడిరక్తిజనించనినాడు బోధసౌ
భాగ్యపుమేర చిత్తగతిబాగుగబ్రహ్మములీనమొంది దౌ
ర్భాగ్యతఁబుట్టకుండుటయ బాగుగనోపరతిప్రసీమయౌ. 426

—♦ జగన్మిథ్యాప్రవక్త కృతార్థుఁడు ♦—

సీ. సర్వకాలములందు సత్స్వరూపమునొంది
వెలయుచుధారుణి విషయవిముఖుఁ

దగుచు నన్యులచేత ననువేదితములగు
భోజనాదికములఁ బొందినిద్రఁ
గనువానివలె బాలకునిరీతి నీజడ
మగువిశ్వమును గలయందుఁ గనిన
జగముకై వడిని వీక్షణము సేయుచు నొకా
నొకతఱి విజ్ఞానమొందిలెస్సఁ

గీ. బూజ్యుఁడగుచును మితిలేని పుణ్యఫలము
ననుభవించు మహాత్ముఁడై యలరునెవఁడొ
జగతినాతఁడు సార్థకజన్ముఁడైన
ధన్యుఁడగునని మదిలోనఁ దలఁపుము బుధ! 427

— ప్రజ్ఞాస్థిత ప్రజ్ఞలక్షణము —

క. పరమాత్మ నెవఁడు చిత్తము
నెరపి వికారములఁ గొనక నిష్క్రియత సదా
పరమానందము నొందునొ
కరము స్థితప్రజ్ఞుఁడతఁడుగాఁ జెప్పఁబడున్. 428

క. పరికింపఁబడిన జీవే
శ్వరులొక్కటియని నిరూఢిఁ జాటెడు నంతః
కరణప్రవృత్తి ప్రజ్ఞగఁ
బరగు స్థితప్రజ్ఞుఁడగును బ్రజ్ఞంబడయున్. 429

— జీవన్ముక్తి ముక్తలక్షణము —

క. ఎవఁడు స్థితప్రజ్ఞుండగు
నెవఁడు సదానందమొంది యెపుడుండు జగం

జెవనికి విస్మృతసమమగు
భువిజీవన్ముక్తుఁడనెడి పుణ్యుఁడతండా. 430

క. ఎవఁడాత్మలీనమైనను
నవబోధత నింద్రియముల నడఁచునో జ్ఞానం
బెవనికిఁ గళంకరహితమొ
భువి జీవన్ముక్తుఁడనెడుపుణ్యుఁ డతండా. 431

క. భవవిషయ శంకనొందక
నెవఁ డవయవవంతుఁడైన హిత నిష్కళుఁడో
యెవని కచింత్యము మదియగు
భువి జీవన్ముక్తుఁడనెడు పుణ్యుఁడతండా. 432

క. అనుదినము ఛాయచాయను
ననువర్తినియగుచు దేహమలరుచునున్నం
గని మమతనొందకుండుట
ఘనజీవన్ముక్తిసంజ్ఞగాఁ జెప్పఁబడున్. 433

క. కనిగతము వగవకుండుట
మునుదనరెడిదానితలఁపు బొడకట్టక పొం
దినదాని నుదాసీనతఁ
గన జీవన్ముక్తసంజ్ఞగాఁ జెప్పఁబడున్. 434

క. గుణములు దోసఁగులు గలదై
యనువుగఁ ద్రిగుణాత్మకమ్మనగునీజగమం
తను దుల్యదృష్టిఁగాంచుట
ఘనజీవన్ముక్తసంజ్ఞగాఁ జెప్పఁబడున్. 435

క. వనటయు సుఖమును బడసినఁ
గనిభేదములేమి నుభయగతులందు సదా
మనసు వికారము లుడుగుట
ఘనజీవన్ముక్తసంజ్ఞగాఁ జెప్పఁబడున్. 436

క.ముని సతతానందరసం
బున మగ్నంబైన చిత్తముంగని వెలిలోఁ
దనకేమి తెలియకుండుట
ఘనజీవన్ముక్తసంజ్ఞగాఁ జెప్పఁబడున్. 437

క. ధనగృహదేహాదులయం
దున నేనని నాదటంచు దుర్మతిఁగనకే
యనయ ముదాసీనతఁగన
ఘనజీవన్ముక్త సంజ్ఞగాఁ జెప్పఁబడున్. 438

క. ఘనమగు శ్రుతిబలమున జీ
వుని బ్రహ్మత్వమ్ముసిద్ధిఁబొందు నతండే
జననమరణాదులొందఁడిఁక
గనజీవన్ముక్తసంజ్ఞగాఁ జెప్పఁబడున్. 439

క. ఎవనికి దేహేంద్రియముల
నవనిఁదదన్యమ్ములందు నహమిదములెదం
దవులకయుండునో యాతఁడు
భువిజీవన్ముక్తుఁడనెడి పుణ్యాత్ముఁడౌ. 440

క. ఎవఁడేసమయమ్మందే
భువిఁబ్రత్యగ్బ్రహ్మలందుఁ బొందెఱుఁగుచు లో

నవిభేదమెంచకుండునో
కవి! జీవన్ముక్తసంజ్ఞఁ గలవాఁడతఁడో. 441

క. తనువు సదాసాధుల దు
ర్జనములఁ బూజలను బాధఁజాలఁగనొందం
గని సమతనొందునాతఁడు
ఘనజీవన్ముక్త సంజ్ఞఁగల పూరుషుఁడో. 442

—♦ విషయదృష్టిని నిర్వికారుఁడు జీవన్ముక్తుఁడు ♦—

ఉ. అన్యులచేతఁ బ్రేరితము లావిషయమ్ములు జొచ్చియేని సౌ
జన్యసదాత్మభావమున సంద్రమునందు నదీప్రవాహస
న్మాన్యతలీనమైవిషయమాఘ్యమునొందక సేయకుండునా
ధన్యయతీశ్వరుండు భవతాపమునొందని నిత్యముక్తుఁడో.

—♦ సంసారాసక్తిరహితుఁడు బ్రహ్మవేత్త ♦—

క. పరమాత్మ తత్వమెఱిఁగిన
పురుషుని పూర్వంపురీతిఁబొందవు భవముల్
ధరఁబరగునతఁడు బ్రహ్మము
నెఱుఁగని లౌక్యస్థితిజ్ఞుఁ డితఁడన నొప్పున్. 444

—♦ జ్ఞానిని బూర్వకర్మ బాధించదు ♦—

క. వెనకటి కర్మబలమ్మున
ఘనసంసారమున వేత్తగాఁ డెటులనన్
మునకర్మమ్ములు మందతఁ
గను బ్రహ్మజ్ఞానమొనరఁ గల్గినకతనన్. 445

—♦ బ్రహ్మవేత్త విషయానందశూన్యుఁడు ♦—

క. తనతల్లిఁగాంచి పుత్రుఁడు.
ఘనకాముకుఁడైనఁ గోర్కెఁగననటు మదిలో
ననవరత మాత్మ తత్త్వముఁ
కను జ్ఞానికి విషయవాంఛఁ గల్గదొకప్డున్. 446

—♦ జ్ఞానికి భోజనాదికము పూర్వకర్మ ♦—

క. తగనాత్మా భ్యాసముమదిఁ
దగిలిన యాతనికి బాహ్యధర్మములుసతం
బుగననుభవమ్మలై చన
నొగి శ్రుతి ప్రారబ్ధమిొనికొనరఁగఁ దెలుపున్. 447

—♦ కర్మ సుఖదుఃఖపూరితము ♦—

క. మొనసిసుఖదుఃఖములు తన
కనుభవమగునంతదనుకఁ బ్రారబ్ధము తాఁ
గనఁబడు వెనుకటికర్మల
నెనయును బ్రారబ్ధమెవ్వఁడిలనిష్క్రియుఁడౌ. 448

—♦ జ్ఞానికి సంచితములేదు ♦—

క. పరమాత్మనైతినేనను
వరబోధ ననేకజన్మవర్ధితకర్మల్
దరిగెడు కలలోఁగార్యము
లురవడి మేల్కాంచుటవలన నొగిఁబోవునటుల్. 449

—♦ జ్ఞానపూర్వకర్మ ఫలరహితము ♦—

క. కలలోనఁ జేయుపుణ్యం
బులు దోసఁగులు మేలుకొనినఁ బుంగవు నెడనే

వలననిడవు త్రైవిష్టప
ఫలమును నరకమునఁగల్గుబాధలనైనన్. 450

—♦ జ్ఞానికాగామికర్మనశించును ♦—

క. తనునభమువలె ననంగునిఁ
గను నౌదాసీనుభాతిఁ గనుఁగొనఁగ భువిన్
మునుగిల్లఁబోవుకర్మల
నెనయక చరయింపఁజెల్లు నెల్లపుడుబుధా! 451

—♦ ఆత్మ ఉపాధిధర్మరహితము ♦—

క. గగనము ఘటసంబంధముఁ
దగిలియు మధుపరిమళమ్ముఁ దాల్చనిరీతిం
దగ నాత్మయుపాధులఁదాఁ
దగిలియుఁ దద్గుణములందుఁ దగులకయుండున్. 452

—♦ ప్రారబ్ధము జ్ఞానమున నశించదు ♦—

క. జ్ఞానముకల్గకపూర్వము
తానొందినకర్మ గుఱినిదనరిన శరసం
ధానముగతిఁ దనఫలమును
బూనక జ్ఞానమునలయముఁ బొందదొకపుడున్. 453

—♦ ప్రారబ్ధ మనుభూతఫలము ♦—

క. పులియనుబుద్ధిని విడిచిన
యలుగిమ్మగఁ బిదపధేనువన నిల్వదు వే
తలఁపడి గుఱియగు గోవును
బలమున భేదించునట్లు ప్రారబ్ధమునౌ. 454

—♦ పరబ్రహ్మైక్యులు కర్మబద్ధులుగారు ♦—

సీ. పండితులకుఁగూడ బలతరమగునట్టి
ప్రారబ్ధమనుభవ ప్రాప్తిఁదొలఁగుఁ
బరగబ్రహ్మజ్ఞాన బడబాగ్నికీలలఁ
బ్రాక్సంచితాగామి భవములుడుగు
సర్వదా బ్రహ్మసాక్షాత్కారమును గని
బ్రహ్మ స్వరూపసంపత్తినొంది
యేమహామహులుర్వి నెంతయునానంద
మంది మెలఁగుచుందురట్టివారిఁ
గీ. గదురకుండెడు సంచితాగామిపూర్వ
జన్మ కర్మత్రయంబును సత్యముగను
నామహాత్ములు నిర్గుణమైనబ్రహ్మ
కన్నభిన్నులుగాకయ క్రాలుచున్కి. 455

—♦ ఉపాధిరహితబ్రహ్మస్వరూపి ప్రారబ్ధశూన్యుఁడు ♦—

గీ. తా నుపాధులుకానను ధర్మమెఱిఁగి
కేవల బ్రహ్మమయుఁడగు కోవిదునకు
జాగ్రదవసరమందున స్వప్నకథలు
లేనిపోలికఁ బ్రాక్కర్మలేకయుండు. 456

—♦ దేహగేహకళత్రాదుల జ్ఞానికాత్మబుద్ధి యుండదు ♦—

సీ. కలయందుఁగనఁబడు తనవున దేహసం
బంధమొందిన యీప్రపంచమందు
నేను నాదిదియను నింద్యమౌబుద్ధిని
గడఁగిజాగ్రదవస్థఁగను నతండు

పూనక మెలఁకువఁబొందెడిరీతిని
జ్ఞాని యసత్స్వరూపమునందు
మానాభిమానముల్ బూని నేనను బుద్ధి
నొగి దేహసంబంధమగు జగతిని

గీ. నాదియనుబుద్ధి విత్తగేహాదులందు
నదియు నిదియను బుద్ధిని నందక భువి
నిత్యసుజ్ఞానమున బ్రహ్మనియతచిత్తుఁ
డగుచు వర్తించుచుండు ననారతమ్ము. 457

—♦ స్వప్నాగ్రాభిలాషి నిద్రాసహితుఁడు ♦—

చ. కలఁ బొడగాంచు వస్తుతతిఁగాంచెడువాంఛయుఁ దత్ప్ర
పంచముం
బొలుపొనరింపఁగాఁ దలఁపుపుట్టుట మేల్కొనువాని కెన్నఁడుం
గలుగవ సత్యమైకలనగల్గినవిశ్వమునందుఁ గోర్కెమైఁ
జెలఁగినవాఁడు నిద్దురనుజెందెననంగ యథార్థమైతగుర్.

—♦ జ్ఞానికిభోజనాదులు స్వప్నవత్స్మరణమాత్రములు ♦—

చ. అనయము బ్రహ్మనిష్ఠుఁడగునాతఁడు తాఁ బరమాత్మగామదిం
గనుఁగొనియస్యకర్మములఁగాంచఁడు మేల్కొన వానిరీతిభో
జనమలమోచనాదుల ప్రశంసయు స్వప్నవిలోకితార్థ స
న్మననమురీతిఁగల్గుఁ బరమాత్మవివేకమునొందువేత్తకున్.

—♦ ప్రారబ్ధ మాత్మకులేదు ♦—

క. తనువొనరుఁగర్మచే నా
తనువునకును గర్మకల్పితంబగును ననా

దినియగుట నాత్మ కర్మను
గన దాత్మయుఁగర్మవలనఁగల్గ దొకప్డున్. 460

— ఆత్మచింతనుఁడు ప్రారబ్ధశూన్యుఁడు —

క. ధరణి నమోఘమ్మగు శ్రుతి
నెరినాత్మను శాశ్వతమ్ము నిత్యమజమనన్
నిరతముఁ జాటఁగ నెట్టులు
బరగును బ్రారబ్ధమాత్మభావునకు వెసన్. 461

— దేహాభిమాని ప్రారబ్ధవంతుఁడు —

క. తనువును దానను భావముఁ
గనునంతకుఁ బ్రాక్తనాదికర్మములుండుం
దనువుందానని తలఁచుట
యనుచితమగుచున్కి త్యాజ్యమగుఁ బ్రాక్తనమున్. 462

— దేహప్రారబ్ధమును భ్రమ. —

చ. భ్రమయగుసుమ్ము దేహమునఁ బ్రాక్తనకర్మయుఁ దెల్పునెట్ల
నన్ భ్రమపడువస్తు వస్థిరపుభావమునందక శాశ్వతస్వరూ
పముఁగనునెట్లు! మిథ్యయగువస్తువుజన్మమునొందు నెట్లజా
తమునకుమృత్యువెట్లెటులుతథ్యముప్రాక్తనకర్మనొందెడున్.

— దేహప్రారబ్ధకథ యజ్ఞానిసమాధానము —

క. అజ్ఞానకార్యమంతయుఁ
బ్రజ్ఞానమువలన లయముఁ బడయఁగనెటుగా
సుజ్ఞానికోరుఁ జనువను
నజ్ఞానులఁ దృప్తిబఱుప నజ్ఞానగతిన్. 464

క. ప్రారబ్ధంబును దేహము
ధారుణిపడియించెఁగాని తత్వజ్ఞులకిం
పారఁగ దేహాదులునిజ
మై రహింఁజెన్నొందుననుట కైక్యగాదుబుధా! 465

—♦ పరబ్రహ్మము బహుళముగాక యేకము ♦—

గీ. ఆదిమధ్యాంత శూన్యము నప్రమేయ
మక్రియమ్మును బరిపూర్ణ మద్వయమ్ము
నైనపరమాత్మయొక్కండ యగునితండు
బహుళరూపమ్ము నావంతబడయఁడెపుడు. 466

గీ. సత్స్వరూపుండు చిన్మూర్తి శాశ్వతుండు
నక్రియుండును నానందుఁడద్వయుండు
నైనపరమాత్మయొక్కండయగు నితండు
బహుళరూపమ్ము నావంతబడయఁడెపుడు. 467

గీ. సాక్షియేకస్వరూపుఁడు సర్వగతుఁడు
నద్వయుండుఁ బ్రపూర్ణుఁడు నవ్యయుండు
నైన పరమాత్మయొక్కండ యగునితండు,
బహుళరూపమ్ము నొక్కింతబడయఁడెపుడు. 468

గీ. విడువఁదగనిది గ్రహియింపఁబడయరాని
దద్వయమ్మననాదేయ మక్షరమ్ము
నైనపరమాత్మయొక్కండ యగునితండు
బహుళరూపము నించుకపడయఁడెపుడు. 469

గీ. నిర్గుణమ్మును సూక్ష్మమ్ము నిర్వికల్ప
మద్వయమ్ము నిరంజనం మక్రియమ్ము
నైన పరమాత్మయొక్కండయగు నితండు
బహుళరూపమ్ము నొక్కింతబడయఁడెపుడు. 470

గీ. ఇట్టిదని తెల్పవీలులేనట్టి రూప
మద్వయమ్మైన నుడులను నందరాని
దైన పరమాత్మయొక్కండయగు నితండు
బహుళరూపంబు నావంతబడయఁడెపుడు. 471

గీ. సత్సమృద్ధస్వతస్సిద్ధ సమ్మతమ్ము
నద్వయమ్మును శుద్ధబుద్ధాత్మ మనుప
నైనపరమాత్మయొక్కండయగు నితండు
బహుళరూపమ్మునించుక బడయఁడెపుడు. 472

—♦ యతులు నిర్వికల్పసమాధిశాంతిమంతులు ♦—

చ. సతతనిరస్తరాగులయి శాంతదమాదులనొంది భోగసం
తతి నెడబాసి లెస్సఁబరతత్త్వమెఱింగి మహానుభావులై
యతు లవసానకాలమున నవ్యయమైన నిజస్వరూపసం
గతినిఘనాపవర్గమునుగాంచుచునుందురుపండితాగ్రణీ! 473

—♦ యతిగతి కృతార్థుఁడవుకమ్ము ♦—

మ. తగనానందమయస్వరూపపరతత్త్వంబీవునన్ యోగిని
ష్ఠగనాత్మంగనిచిత్తమందొనరుమూఢత్వంబుఁజెండాడియో
[illegible]లంబొందక జ్ఞానమూర్తివయి జీవన్ముక్తభావమ్మునన్
[illegible]ొందకృతార్థజన్మమునసంశోభిల్లగానెంచుమా!

—♦ గురువచనము నికారణశూన్యము ♦—

గీ. నిర్వికల్పసమాధిని నిర్మలమగు
జ్ఞానమున నాత్మతత్త్వముఁజూసి గురుము
ఖమున విన్నది నిస్సంశయముగఁ దెలియఁ
దిరిగి సంశయయుక్తమై వరలదెపుడు. 475

—♦ బ్రహ్మానందప్రమాణములు నాలుగు ♦—

చ. తనకవివేకబంధమునఁ దద్దయుమోక్షము సంభవించినన్
ఘనపరమాత్మబ్ధికయి క్రన్ననిత్యము నంతరాత్మయం
దనుభవమాగమంబుఁ సముచితయుక్తియుసద్గురూక్తియున్
వినయవివేకశీల! భువి వేడ్కఁ బ్రమాణములై తనర్చెడున్. 476

—♦ క్షుత్పిపాసాము లాత్మజ్ఞేయములు ♦—

క. తనబంధముఁ దనమోక్షముఁ
దనతృప్తియు క్షుధయుఁ జింత తనకుశలంబుం
దనకొనరఁదెలియు నితరులు
గన నివి యనుమానమగుచుఁ గ్రాలుచునుండున్. 477

—♦ గురూపదేశజ్ఞానము తరణోపాయము ♦—

క. వేదములఁ బోలె గురువులు
బోధింత్రు తటస్థులగుచు బుధుఁడీశ్వరసం
పాదిత సత్ప్రజ్ఞుండై
తాఁదరియింపంగవలయుఁ దత్త్వజ్ఞుఁడునై. 478

—♦ అనుభవమునఁ బరబ్రహ్మ తానగుట ♦—

క. తగననుభవమునఁ బూర్ణుం
డగునాత్మనుఁ దానుదన్నునరయుచు మునియై

సుగమ ప్రదీపు నిశ్చల
ముగ బ్రహ్మావసింపవలయు మోదముసబుధా! 479

—♦ పరిపూర్ణ బ్రహ్మస్వరూపము ముక్తి ♦—

క. జగమును జీవుఁడు బ్రహ్మమ
యగుఁ బరిపూర్ణమ్ము బ్రహ్మమగుటయ మోక్ష
మ్మగు బ్రహ్మమద్వితీయం
బగుననుటకు సాక్షియగుత మామ్నాయంబుల్. 480

—♦ గురుకృపారసపాత్రుఁడు నిశ్చలుఁడు ♦—

చ. హితమగు యుక్తినిన్ శ్రుతిని నీగతిఁ దెల్పెడు దేశికోక్తినిన్
మతిఁబరమాత్మతత్త్వమనుమానము లేక యెఱింగి యింద్రియ
ప్రతిఘటనమ్మొనర్చుచు నభంగురచిత్తముఁ నొంది బ్రహ్మను
వ్రతుఁడయిశిష్యుఁడుండెనొకపర్వతసామ్యమునన్ స్థిరుండునై.

—♦ శిష్య ప్రశ్న ♦—

క. అంతఃకరణము బ్రహ్మముఁ
గొంతవడిన్నిల్పి లేచి కోవిదుఁడు మహా
సంతోష చిత్తుఁడగుచును
వింతగ నీచెప్పఁబోవు విధమునఁబలికెన్. 482

—♦ నిర్వికల్ప సమాధి ♦—

క. జీవేశ్వరుల నభేదపు
భావమునంగనుట బుద్ధిబాసెఁ బ్రవృత్తుల్
జేవచెడె నిహపరమ్ముల
భావము సౌఖ్యమును సౌఖ్యపారమునెఱుఁగన్. 483

— బ్రహ్మానందము —

శా. స్వానందామృతపూరపూరితపరబ్రహ్మాబ్ధి సద్వైభవం
బేనోటన్వచియింపఁజాల మదిలో నెంచంబలంబేను నం
భోనాథు న్వడగండ్లపోలికమనంబుల్ బ్రహ్మభాగమ్ములన్
లీలంబొంది మహాముదంబుననుహాళిందృప్తిఁదానందెడిన్.

క. చూచితి నీవిశ్వంబిపు
డేచోటున కగ లేదదెవ్వరినోదిగం
బ్రాచుర్యమయ్యె నెచ్చటఁ
దోచదు మహాదద్భుతమ్ము దోఁచుచునుండెన్. 485

— పరబ్రహ్మసిద్ధి సమానబుద్ధి —

క. సతతానందసుధాపూ
రితమగుబ్రహ్మాబ్ధియందు రెక్కొనహేయం
గతమెద్ది గ్రాహ్యమెయ్యది
వెతుకఁగ నవశిష్టమెద్ది వేఱెద్దియగున్.

— నిత్యానందము భేదరాహిత్యము —

క. నిరతానందంబాత్మను
వరల విలక్షణుఁడనగుచుఁ బరగెడినాకీ
ధరఁబరమాత్మను వినుటయు
నరయుట తెలియుటయు లేకయలరుచునుంటిన్. 487

— గురునమస్కృతి —

మ. నిరతానందరసస్వరూప! విలసన్నిర్ముక్తసంసారసం
గరతాపార కృపాంబురాశి! విబుధగ్రైవేయకా! దివ్యస

చ్యుతా! పూరుషరత్నమా! గురువరా! స్వాంతమ్మునందెప్డునిం
గరమొప్పంగన నిల్పిచేసెదనమస్కారమ్ములెన్నేనియున్.

చ. ఎవనికటాక్షవీక్షణపుటెందురుచింగన భీమతాపసం
భవమగునార్తివేవిడిచి వైభవసౌఖ్యమునొంది యెంతయే
నవనిని నక్షయంబయినయాత్మపదంబును బొందినాడనో
జవమున నామహామహుని సద్గురువర్యునతింతునిన్నెదన్.

—♦ శిష్యవచనము ♦—

క. నీదయను నేఁగృతార్థుఁడ
నేఁదగ ధన్యుండదాపనీరధి ముక్తిన్
నేఁదొలఁగఁజేసినాడను
నేదివ్యముదాత్మకుండ నేపూర్ణుండన్. 490

క. సంగవివర్జితుఁడను నే
నంగవిహీనుండ నేననాహ్వయుఁడను ని
ర్లింగుఁడ శాంతుఁడనంతుఁడ
భంగరుఁడ సనాతనుండఁ భవరహితుండన్. 491

క. అవికారుఁడ నిష్క్రియుఁడను
భువిఁగర్తను గాను నేను భోక్తయనఁగనే
నవకాశ మొందకుందును
బ్రవిమల సుజ్ఞానమయుఁడఁ భవ్యుడ శివుఁడన్. 492

క. కనువారికి విను వారల
కనుభవునకు వక్తకిలను గర్తకు భిన్నం
బును నిత్యమ్ముక్రియుంబును
ననగమము నసంగపూర్ణమగు జ్ఞానిని నేన్. 493

క. కానిది కానది రెంటినిఁ
బూనుప్రకాశమును శుద్ధపూర్ణము బయల్
లోనను భేదము లేనిది
మానుగఁ బరమద్వితీయమగు బ్రహ్మము నేన్. 494

క. ఎనలేని దాదిలేనిది
యన నిది యది నేను నీవు నను భేదములం
గన కేకసత్యరూపము
ననవరతానందమయము నగు బ్రహ్మము నేన్. 495

క. నరకాంతకుఁడను హరినిం
బురుషుఁడను బురాంతకుండ భూతియుతుండన్
నిరహంకారుఁడ సాక్షిని
నిరతుఁడను నిరీశ్వరుండ నిర్మముఁడను నేన్. 496

క. ఏనాశ్రయుండనగుచును
జ్ఞానమున సమస్తభూతచయమున వెలినిన్
లోనంటిభోక్తభోగ్యము
నేనగుదు సమస్తజగము నేనగుదు బుధా! 497

క. మాయాస్పర్శము వీవఁగ
వేయివిధంబులుగ విశ్వవీచులు జననం
బై యడఁగిపోవుచుండెడు
నాయతసౌఖ్యాబ్ధిరూపమగు నాయందున్. 498

ఉ. కల్పనమాయ నాదులు వికల్పనకాలమునందు నెవ్విధిం
గల్పితమయ్యె నాగతి నఖండరసాత్మకమైన నాయెడం

గల్పితమయ్యె స్థూలపదకల్పనలెల్ల జనాళిభ్రాంతిమైఁ
గల్పితమైనద్రవ్యములఁగాంచినదాన్స్మరియించుచుండఁగన్.

—♦ ఆరోపిత మాధారభిన్నరహితము ♦—

క. కలుషాత్మారోపితమెపు
డిల నాశ్రయమైనదాని నెడపక యుండున్
లలినెండమావులందలి
జలమూషరభూమిఁ దడుపఁజాలని కరణిన్. 500

—♦ నేను బరిపూర్ణబ్రహ్మను ♦—

క. గిరివలెను సుస్థిరుండను
వారిగతి భాస్యములభిన్నమగువాఁడను నం
బరమువలె సంగరహితుఁడ
శరధిగఁ బారమ్ములేనిశక్తుఁడ నగుదుఁగా. 501

—♦ నేను దేహాదిసంబంధరహితుఁడను ♦—

క. మొగిళుల నింగికినింబలెఁ
దగఁదనువుల బంధమెపుడుఁదగులదు నాకొ
ప్పుగ నందువలనఁ దద్గతు
లగు జాగ్రత్స్వప్ననిద్రలవి యెట్లొదవుఁగా ! 502

—♦ నే నచలుఁడను ♦—

చ. స్వయముగఁదానెవచ్చెడునుపాధియదేపరతెంచుఁగర్మసం
చయమునదేయొనర్చు ఫలసంతతినానునదే మఱిన్ జరా
మయమునదేభరించుచుఁగుమారిలిమృత్యువునందు నేనుని
శ్చయముగనిశ్చలాత్మఁగుల శైలముపోలికనుందు నెప్పుడున్.

—♦ నిత్యానందుఁడు సర్వప్రియుఁడు ♦—

చ. అవయవశూన్యమై యొకఁడ నద్వయుఁడు నాకు నివృత్తి వృత్తులె
య్యవి గనలేక యుండెడి నిం గివిభాతి నొక్కరుండు నే
యవధి నెఱుంగరాని యతఁడంతట నిండినవాఁడు బ్రహ్ముఁడుం
బ్రవిమల సత్స్వరూపుఁడు పరాత్పరుఁ డెట్టులు జేష్టలొందెడిన్.

—♦ దేహాభిమానశూన్యుఁడు పుణ్యపాపరహితుఁడు ♦—

చ. అమలుఁడ నిర్వికారుఁడ నిరాకృతుఁడం దమనేంద్రియుండ స
ద్విమలసుఖానుభూతి నయి వెల్గెడు నాకెటు పుణ్యశేషముల్
దమిగలుషంబులుంగలుగుఁ దద్దయు వేదము దోషమందుఁ బు
ణ్యమునను బొత్తు లేదని యథావిధిఁ దెల్పుచునుండఁగన్ సదా.

—♦ పుణ్యపాపములు పరబ్రహ్మనగు నాకు లేవు ♦—

క. ఛాయను నంటుచు నుండిన
నేయుష్ణముఁ జలియు నెండ హితమహితంబున్
ఛాయకు వేఱగు పురుషుని
నేయింతయు నంటకుండుటిది నిక్కంబౌ. 506

ఆ. దీపకాంతివలనఁ దేజరిల్లెడు గృహ
గతులు దీపమందుఁ గ్రాలనట్లు
నా చిదాత్మ వెల్గు నహమాది ధర్మమ్ము
లంటకుండు సాక్షి నక్రియాత్మ. 507

—♦ నేను సాక్షిమాత్రుఁడను ♦—

చ. హరి యెటు లోకకర్మముల సాక్షి మయుండయి వెల్గుచుండు నే
కరణిని వీతిహోత్రుఁ డిల కాల్చు పదార్థములన్నియంతయా

ఘనెటు త్రాడుకల్పిత పదార్థపుంబొత్తునంగ్రాలుదోషముల్
దొరలుటజ్ఞానమూర్తినయితో౯ంజెడు నేనునుసాక్షినాక్రియన్.

—♦ నేను స్వయంజ్యోతిస్వరూపుఁడను ♦—

ఉ. చేసెడివాఁడఁగాను భువిఁజేయఁగఁదెల్పెడివాఁడఁగాను గా
నాసభుజించువాఁడఁ బరులానఁగఁజేసెడువాఁడఁగాను ద్ర
ష్టాళుఁడఁగాను గాకకనునట్టులుచేసెడువాఁడఁగాను దృ
గ్భాసముగాకదావెలుఁగుబ్రహ్మమనేనయిక్రాలుచుండెదన్.

—♦ మూఢుఁడు బుద్ధ్యాదులనాత్మగఁదలంచును ♦—

మ. జలముల్ సంచలమొందఁదజ్జలములంజాంచల్యమాబింబసం
చలనంబుం జెడులంటఁగట్టురవినాచక్కిన్ గుణోపాధులుం
జలనంబుంగనఁదద్గుణంబులను నిచ్చల్ నిష్క్రియుంబూన్చితా
నిలకర్తన్మఱిభోక్తనైతి మరణంబేనొందితఁ బ్బాయనున్.

—♦ నేను పాధిరహితుఁడను ♦—

క. ఘటమయమగు నీదేహం
బెటులేని జలంబు స్థలము నెఁచ్చఁబడిసన్
ఘటపడవు తద్గుణంబులు
ఘటధర్మములాకసంబుఁ గాంచని గతి నన్. 511

—♦ కర్తృత్వాదులు కల్పితములు ♦—

మ. పరముం గేవల మద్వయంబగు పరబ్రహ్మంబునౌనాకుసం
సరణంబున్మదమున్ జడత్వమును మోక్షంబున్ ఖలత్వంబు సం
హరణారంభములెల్ల బుద్ధివలన స్సంకల్పితంబయ్యెను
స్థిరతత్త్వంబుగ నెవ్వినాయెడను వీక్షింపంగ లేవెవ్విధిన్. 512

—♦ నేను ప్రకృతి వికారశూన్యుఁడను ♦—

క. మాయకు వికారములు బది
యో యిరునూర్లో సహస్రమో యున్న వెసం
దోయదము నింగినింబలె
నాయవి చిన్మయుఁడనగుట నంటవు నన్నున్. 513

—♦ నేనద్వయ పరబ్రహ్మను ♦—

శా. ఆభాసంబగుచుండు నీపుడమియవ్యక్తాది దేహాంతమై
యేభవ్యుం బరమేశ్వరుండెవఁడొ త్రానంతేనిసూక్ష్మండువ్యో
మంబుంబోలుచునుండియాదితుదయేమాత్రంబులేకుండునో
యాభవ్యంబగు బ్రహ్మమేనయితి నద్వైతాంతరంగుండనై.

శా. ఏభవ్యుండువిశుద్ధమూర్తియునుసర్వేశుండొసర్వంబుఁదా
శోభిల్లంగనుజేయునో సకలసంశూన్యుండొ నిత్యుండొ ని
త్యాభుండై నయఖండనిశ్చలుఁడొనిర్వ్యాపారనిర్భిన్నుఁడో
యాభవ్యంబగు బ్రహ్మమేనయితినద్వైతాంతరంగుండనై.

శా. ఏభవ్యుండు సమస్తతత్వములయందీశుండొ ప్రత్యస్తమా
యాభాసుండొమతింబ్రవృత్తిపవగమ్యుండొచుభాసిల్లునో
యేభద్రుండుప్రబోధమూర్తియునుసర్వేశుండునిశ్చేష్టుఁడో
యాభవ్యంబగుబ్రహ్మమేనయితినద్వైతాంతరంగుండనై.

క. అవికారుఁడ నిష్కళుఁడను
నవగమ్యుఁడ నిష్క్రియుఁడ నిరాకృతుఁడనునే
నవికల్పకుండ నిత్యుడ
భువినిర్ద్వయమైనయట్టి పురుషుఁడనైతిన్. 517

క. నేసర్వరూపకుండను
నేసర్వవ్యాపకుండ నేనద్వయుఁడన్
నేసర్వాతీతుండను
నేసర్వ జగన్మయుండ నిరతసుఖుండన్. 518

క. ఈనిరత సౌఖ్యవిభవం
బేనొందితి నీదుకరుణ నిమ్మగనిలదై
వానుగ్రహమున గురువర!
మానసమున నీకునతులు మఱిమఱిఁ జేతున్. 519

చ. గురువర స్వప్నతుల్యమగు ఘోరభయంకరమాయచేతనీ
జరజననమ్ముమృత్యువను సంతతిరూపపుఁగానవెప్పుడుం
దిరుగుచుఁదాప మొందికడుదీనతచే నహమాఖ్యయాపులిన్
గుఱియగునన్ను నోమితివి గొబ్బునమేలొనఁ జేసిత్వత్కృపన్.

క. తేజమయి విశ్వమయమయి
రాజిల్లుచుఁగరణగోచరముఁగాక సదా
యోజనొకరూపమగు గురు
రాజా! యొనరింతునీకు రక్తిని నతులన్. 521

—♦ గురువచనము ♦—

చ. సమధిగతాత్మసౌఖ్యుఁడయి సంతతముం బరమాత్మఁ గాంచుచుం
బ్రముదితమానసుండగుచు భక్తినినీగతిమ్రొక్కుశిష్య స
త్తమమహనీయుఁడౌగురు వదాన్యుఁడు లెస్సఁగఁజూచిదివ్యవా
క్యము మరలన్వచించెనిటులర్మిలి రెక్కొనఁజక్కఁగ్రక్కునన్.

—♦ బ్రహ్మవేత్త పరబ్రహ్మస్వరూపమునే కోరును ♦—

ఉ. సర్వజగమ్ము బ్రహ్మమున జన్మమునందుటనన్ని వేళలన్
సర్వము బ్రహ్మమేయనుచు శాంతమునంబిరదృష్టిఁగాంచుమీ
సర్వముఁజూచుటం గలుగు సక్తియకన్నుల కుండురీతినీ
యుర్విని బ్రహ్మరూపమునునొప్పఁగఁజూచుట వేత్తధర్మమా.

—♦ బ్రహ్మవేత్త నిర్విషయాభిలాషి ♦—

క. పూనిశశివెలుఁగుఁ గొననే
మానవుఁడును జిత్రచంద్రు మదిగోరనటుల్
జ్ఞానిప్రసిద్ధంబగు పర
మానందరసంబుఁబుచ్చి యన్యముఁగనునే? 524

—♦ విషయసుఖము దుఃఖప్రదము ♦—

క. వనటనశింపదు తృప్తియుఁ
దనరదు విషయానుభూతిఁ దవులుటచే నీ
వనవరతమాత్మనియతిని
గని స్వానందమునఁదృప్తిఁగాంచుము విబుధా! 525

—♦ నిత్యానందమునఁ గాలముగడుపుము ♦—

క. తనయందంతయుఁ గనఁ గొని
తనునద్వయపూర్ణ మనుచుఁదలఁచుచును సదా
మనమున నాత్మానందం
బనుభవమునుగొనుచుఁగాల మనుపుము శిష్యా! 526

—♦ బ్రహ్మానందము చిత్తసమాధి ♦—

ఉ. మార్పులులేక బోధమయమై నిరతంబగునాత్మయందునన్
మార్పులనూహ సేయుటఁ గనంగ నభఃపురమానుగాన నీ

వోర్పునుబొందియద్వయసుఖోన్నతినొందుచునెల్లకాలమే
మార్పులులేకనిశ్చలసమాధినిమౌనముఁదాల్చియుండుమా.

—♦ బ్రహ్మవేత్తకు సమాధి ముఖ్యము ♦—

క. ఘనుఁడగు బ్రహ్మజ్ఞానికి
ననాత్మకమయిన ప్రజ్ఞను ననవరతము నెం
దున నిత్యసుఖముఁగనునా
ఘనదశకదలకయబ్రహ్మగతినుంట తగున్. 528

—♦ జ్ఞానికి మౌనము ముఖ్యము ♦—

క. తా నాత్మసిద్ధి నొందుచు
స్వానందరసంబుఁగ్రోలు జ్ఞానికివెలినిన్
లోన న్వాసనలుడిగిన
మౌనంబునకన్న యుత్తమములేదొకఁడున్. 529

—♦ జ్ఞాని పరతంత్రుఁడుగాడు ♦—

క. తనయందానందముఁగను
మననాత్ముఁడు జ్ఞానియెట్లుమసలిన నిలువం
గను నుపవసింప నిదురం
గనినను సకలమున స్వేచ్ఛగా నెపుడుండున్. 530

—♦ జ్ఞానికి దేశకాలాదు లనవసరములు ♦—

క. ప్రతిబద్ధవృత్తిఁదత్వ
స్థితిఁగనుబుధునకు యమంబు దేశముకాల
స్థితి యాసనమ్ము గుఱి దెస
లతిదూష్యములాత్మబోధమనియమమగుటన్. 531

క. సరియగువస్తుజ్ఞానము
నెఱిఁగించు ప్రమాణముడిగి యెవఁడిదిఘటమం
చెఱుఁగఁగనియముఁగోరెను
ధరను బ్రమాణమ్ము మ్రోలఁ దనరుచునుండఁగ. 532

క. దేశము కాలము శుద్ధిని
నాశింపక నిత్యసిద్ధమగునాత్మ సదా
భాసిల్లుసత్ప్రమాణము
మై సుజ్ఞేయమ్ము కతనమహనీయంబై 533

—♦ జ్ఞానికి నియమముతోఁబనిలేదు ♦—

క. ఘన దేవదత్తుఁడీశం
డను జ్ఞానమపేక్షరహితమగునట్లుసదా
యనుమానమెడల బ్రహ్మం
బనునేనని వేత్త తెలియుటన పేక్షితమా. 534

—♦ అసత్పదార్థము పరమాత్మనువికసింపచేయజాలదు ♦—

క. రవివలెను సర్వవిశ్వం
బెవనిరుచిని వెల్గుచుండు నెంతయుఁగనఁగా
నవభాసమతని జేయవు
భువిమిథ్యారూపకాంతిపుంజములెపుడున్. 535

క. సకలములగుభూతమ్ములు
సకలపురాణములు వేదశాస్త్రార్థములే
యకలంకమూర్తిచేసా
ర్థకమగు నవ్వానికెద్దితగదీప్తినిడున్. 536

— ♦ జ్ఞాని పరమోత్తముఁడు ♦ —

క. ఏపరమాత్మనుగనుఁగొనఁ
దాపహతుండగుచుబుధుఁడు ధన్యతఁగనునో
యాపరమపారమనుభవ
రూప మనుప మప్రమేయరూపంబునగున్. 537

— ♦ బ్రహ్మవేత్త నిత్యతృప్తుఁడు ♦ —

క. వనటఁబడక విషయమ్ములఁ
గనిమురియక రక్తిఁగొనక, గాకవిరక్తుం
డనవరతానందరసం
బునఁదృప్తిరమించునాత్మబుధుఁడెవ్వేళన్. 538

— ♦ బ్రహ్మవేత్తనిత్యపరబ్రహ్మరతుఁడు ♦ —

క. ఆఁకలినలసటబాలుఁడు
చేకొనకొకదానినాటఁజెలగెడుగతిను
శ్లోకురమించెడు ; బుధుఁడే
పోకటమోహమ్మునహము బొందకసుఖియై. 539

— ♦ జ్ఞానిప్రవర్తన ♦ —

సీ. చింతారహితధైర్యవంతభిక్షునఁదింట
నదనదీజలముల నానటయును
జనరహితంబగు వనముననోగాక
రుద్రస్థలమునందొ నిద్రఁగనుట
నిర్బంధమెఱుఁగక నిరతస్వతంత్రేచ్ఛ
నొందినిర్భయుఁడయి యుండుటయును

కలకాలముదుకని కాషాయచేలముల్
ధరియించుటయొ దిగంబరుడగుటయొ?

గీ. సహనమునభూతలమ్మున శయ్యఁగనుట
దివ్యనిగమాంతవీథులఁ దిరుగుటయును
మించియెప్పుడుబ్రహ్మఁ గ్రీడించుటయును
బడసిక్రాలుచునుందురు బ్రహ్మవిధులు. 540

—♦ జ్ఞాని ప్రాప్తానుభవుఁడు ♦—

చ. కులమునుగోత్రముం దెలియకుండఁగ బాహ్యపదార్థమందు నం
దలఁపువహింపఁబోక పరతత్వవిదుత్తముఁడాటబండి నా
నలరుశరీరమొంది విషయమ్ములనెల్లఁబరేచ్ఛ బాలుని
న్వలెఁదగనాడుచుండెడిని బ్రాప్తనకర్మఫలానుభూతుఁడై.

—♦ జ్ఞాని బాలోన్మత్త పిశాచతుల్యుఁడు ♦—

ఉ. అంబరముల్ధరించియొ దిగంబరరూపముతోనొ చర్మమా
యంబరమంచుదాల్చియొచిదంబరమందుననిల్చి బాలునిక్
డంబున వెఱ్ఱివానివలె దయ్యముపట్టినవానిపోలికన్
సంబరమొందితాఁదిరుగు క్ష్మాతలమందున జ్ఞానిసర్వదా!

—♦ జ్ఞాని నిష్కామానుభవుఁడు ♦—

క. మునియేకచరుండయ్యును
దనయాత్మనుదుష్టినొంది తాఁబూర్ణుండై
యనవరతమాశలుడుగుచు
ననుభవమును బొందుభోగ్యమగువిషయములన్. 543

—♦ బ్రహ్మవేత్త సంచారక్రమము ♦—

చ. జడుగతినొక్కచో నొకట జ్ఞానివలె న్మతియొక్కచోట సౌ
మ్యుఁడుగనునొక్కచోఁ బ్రభువునన్నతినొక్కెడవెఱ్ఱివోలెఁ బా
త్రుఁడువలెనొక్కచో నొకటదుర్గనురీతిని సంచరించునీ
వడువున నెన్నియోగతులఁ బ్రాజ్ఞుఁడునిత్యసుఖానుభూతియై.

క. ధనహీనుఁడైనఁ దుష్టుఁడు
ఘనబలుఁడసహాయుఁడైనఁగలభోగ్యముదా
ననుభవముఁగనక తృప్తుం
డనుపముఁడైయున్నఁదుల్యుఁ డన్నిటనుసదా. 545

క. కర్తగ భోక్తగ నుండియుఁ
గర్తయు భోక్తయునుగాక గాత్రుండైనన్
మూర్తియును గాక యొక్కెడ
వర్తిల్లిన సర్వలోక వర్తనుఁడితఁడౌ. 546

—♦ జ్ఞాని సుకృతాదిశూన్యుఁడు ♦—

గీ. తనువునందున నభిమానమును ద్యజించి
వేడ్కవెలిగెడి పరతత్త్వవేత్త నెపుడుఁ
దొడరి సత్కృతపుంజము దుష్కృతమ్ము
నప్రియమ్ములుఁ బ్రియములు నంటకుండు. 547

ఉ. స్థూలముఁ గారణాంగమును సూక్ష్మమునుంగని మోహవంతుఁడై
గ్రాలినఁబుణ్యపాపములుఁ గష్టసుఖంబులుఁ గల్గుఁగాని తా
నోలి మమత్వమున్విడిచి యోజసదాత్మ మయుండునైన
నచ్ఛిలికిఁగష్టసౌఖ్యములు చెన్నలుఁబున్నెము లెట్లుకల్గెడిన్.

—♦ మూఢులు బ్రహ్మవేత్తలను దేహమాత్రులుగాఁ దలంతురు ♦—

ఉ. మినురతనమ్ము రాహువు నమ్రింగుఁడుగాకను గ్రస్తమైనటుల్
గనఁబడ వస్తుతత్త్వమును గాంచక భ్రాంతిని గ్రస్తమైనవాఁ
డని జెడు లార్చునట్లు జననాది విముక్తుని బ్రహ్మవేత్తనుం
దనువునఁ గ్రాల దేహిగతిఁ దద్దవచింతురు మూఢమానసుల్.

—♦ జ్ఞాని దేహమును మరచియుండును ♦—

క. ఫణికుబుసముఁ దలఁపనిగతిఁ
దనువును నీబ్రహ్మవేత్త త్యజియించి సదా
మని యెడు ప్రాణానిలమున
ననువుగ నిటు లటులుఁ జలన మొందు నతండై. 551

—♦ జ్ఞానికిఁ బ్రారబ్ధమునఁ దనువనుభవమొసంగును ♦—

క. దారువు స్రోతోగతి సే
పాఱుచు నొక్కెడను మిట్టపల్లపు నేలం
జేరునటు లనుభవమ్ములఁ
బ్రారబ్ధమువలనఁ దనువు బొల్పడుచుండున్. 552

—♦ జ్ఞాని సకామిగా నగపడినను నిష్కామి ♦—

చ. భవమెడలంగఁ ద్రోయు బుధవర్యుఁడు ప్రాగ్భవకర్మవాసనల్
దవులఁగ నన్నపానములఁ దత్పరుఁడట్లు చరించుఁగాని తా
నవికలుఁడై ప్రసిద్ధుఁడయి సాక్షిగఁ జక్రపుమూలమట్లు నీ
యవనిని సంగదూరతవిహారము సల్పుచునుండు నెల్లెడన్.

—♦ జ్ఞాని క్రియాఫలాసులఁ దటస్థుఁడు ♦—

క. చొరవడ భోగ్యములను మతి
మరలింపఁడు మధ్యవర్తి మాడ్కిని గ్రియలన్

వరలెడు ఫలమును గోరఁడు
పరమానంద్వామృతమ్ము్నఁ బడసియితఁడీలన్. 554

—♦ జ్ఞాని శివస్వరూపి ♦—

క. లక్ష్యాలక్ష్యములను మతి
లక్ష్యమొనర్పకయ కేవలము బ్రహ్మంబై
లక్ష్యమిడు తత్వవేత్త సు
లక్ష్యముగా శివుఁడనఁగవిలసనముఁగాంచున్. 555

—♦ జ్ఞాని అద్వయబ్రహ్మము ♦—

క. ధరజీవన్ముక్తుండై
పురుషార్థుండగుచుజ్ఞాని భువిబ్రహ్మమునై
వరలుచు నుపాధులుడుగుటఁ
బరమాద్వయపూర్ణమైన బ్రహ్మంబయగున్. 556

—♦ బ్రహ్మవేత్త బ్రహ్మమే ♦—

క. స్త్రీవేషధారివేషపు
భావంబున వేషపూర్వభావమునందుం
దావేడ్కఁ బురుషుఁడగుగతి
నేవేళను బ్రహ్మవేత్త యిలబ్రహ్మమగున్. 557

—♦ జ్ఞానికి శరీరము శుష్కపత్రసమము ♦—

క. జ్ఞానిశరీరము ముదిమిని
బూనియెటో యెచటో యెపుడో భువిఁబడుఁ దరువుం
దానెండిరాలుటాకన
జ్ఞానాగ్నిని మున్నెదగ్ధ సంగతిఁగలదై. 558

—♦ జ్ఞాని శరీరత్యాగమునకు దేశకాలాదు లనవసరములు ♦—

చ. నిరతముసత్స్వరూపమునునిత్యముబ్రాహ్మమునైనబ్రహ్మముం
జొరబడి తత్సుఖామృతము జుఱ్ఱఁగఁదన్మయుఁడై నజ్ఞానికిన్
స్థిరముగమాంసవిణ్మయపు దేహమునావలఁ ద్రోసివేయనీ
ధరసమయమ్ము దేశమను ధర్మములెయ్యవి లేకయుండెడిన్.

—♦ అజ్ఞాననాశనము ముక్తి ♦—

గీ. దేహమోక్షమ్ము ముక్తిగాఁ జెప్పఁదగదు
దండమును వీడమఱియుఁ గమండలమ్ముఁ
బాయమోక్షమ్ముగాదది మాయయనెడి
ముడి మనస్సున వీడిన ముక్తియగును. 560

—♦ జ్ఞాని దేహమెచ్చట విడిచినను జింతింపఁడు ♦—

క. నదియందునఁ గుల్యమునం
బడపడి శ్రీశైలమునను భవనముముందుం
జెదిరిదళము బడఁదరువున
కొదవునె మేల్కొళ్ళఁగాంచ నర్హీస్థలిలోన్. 561

—♦ ఆత్మ అక్షయము, చిత్తలయమాత్మసాక్షాత్కారము ♦—

చ. ఫలములుఁ బుష్పరాజములుఁ బత్రములుర్భువిడుల్లిపోయినం
జలనములేనిభూమిజముచాడ్పున దేహముఁ బ్రాణమింద్రియం
బులుహృదయమ్మునాశనమునొందినఁదానయిబ్రహ్మరూపమై
యలరెడునిత్యసౌఖ్యమగునాత్మకునాశనమబ్బదెప్పుడున్.

—♦ ఆత్మసత్యము, ఉపాధిరహితము ♦—

క. నిండిన జ్ఞానముచేత వ
ఖండమ్మనియాత్మనొనరఁగాఁబల్కు శ్రుతుల్
పండిత ! యుపాధులకుఁగీ
డుండుటఁదెలియంగఁ జెప్పుచుండెనుబిదపన్. 563

క. అవియఁగ నుపాధివర్గం
బవినాశనమాత్మయగునురా యనిలెస్సన్
భువిఁదెలియఁబలుకుచుండెను
"నవినాశీవా అరేయమాత్మేతి" విధుల్. 564

—♦ జ్ఞానాగ్నిదగ్ధదేహాదులు పరమాత్మంబొందును ♦—

చ. తరువులు రాళ్లుఁబొట్టుఁదృణధాన్యములాదిసమస్తవస్తువుల్
ధరదహనమ్మునొందుచు యథావిధిమృణ్మయమైనయట్లు సు
స్థిరముగ నింద్రియమ్ములను దేహముబుద్ధ్యసువాదిదృశ్యముల్
పరమమునొందుజ్ఞానబడబానలదాహమునందిపొందుగన్. 565

—♦ జ్ఞానికి సర్వప్రపంచము బ్రహ్మమయము ♦—

క. హరిభిన్నమైనఁ జీఁకటి
హరిరుచినైక్యంబునొందు నాకైవడి నీ
ధరఁగల్గు సకలదృశ్యముఁ
బరమాత్మను నస్యమగును బాగుగవిబుధా ! 566

—♦ ఉపాధిలయమున బ్రహ్మవేత్తబ్రహ్మము ♦—

క. పగులఁగఁ గుంభముగగనము
గగనంబగుచుండునిజముగా నాగతినిం

దగలయముఁగన నుపాధులు
నగుబ్రహ్మము బ్రహ్మవేత్త యగునతఁడు ధరన్. 567

ఉ. క్షీరములోనఁబోయఁబడి క్షీరము లైక్యతనొందు నైవడిన్
నీరమునందు నుంపఁబడి నీరములీనముఁ గాంచు రీతిగన్
ధారగఁద్రైలమందిడిన తైలము నేకత నొందుపోల్కి నిం
పారఁగబ్రహ్మవేత్తయునుబ్రహ్మమునందునలీనమయ్యెడిన్. 568

—♦ జ్ఞానిపునరావృత్తిరహితుఁడు ♦—

క. ఈవిధినఖండితము స
ద్భావమ్మువిదేహముక్తిఁ బడసినయెడలం
దావేత్త మరల వర్తన
భావుఁడుగాకుండు నెపుడు బ్రహ్మమయుండై. 569

—♦ పరబ్రహ్మ జన్మరహితుఁడు ♦—

క. అనవరత మాత్మరూపముఁ
గనియైక్యము వలనదగ్ధకారణుఁడగునీ
ముని బ్రహ్మ భూతుఁడగుటను
బునరావృతిఁ గొనఁడుబ్రహ్మ పుట్టువుఁగననే? 570

—♦ బంధమోక్షములు కల్పితములు ♦—

చ. చలనములేనిరజ్జువున సర్పమునెంచుచు వెంటఁద్రాడుగాఁ
దలఁచుటరెండుఁద్రాఁడునయథార్థముగాఁగనలేకభ్రాంతిమై
దలఁపడినట్టులాత్మకునుడథ్యముగాఁగనబంధమోక్షముల్
గలుగకమాయచేతఁబరికల్పితమైతనరారుచుండెడిన్. 571

— బ్రహ్మబంధమోక్షరహితుఁడు —

ఉ. ఆవరణమ్మునున్నదని యార్చిన బంధము ముక్తి లేదునా
నావరణమ్ము బ్రహ్మకెటుఁ లంటెడు బ్రహ్మము ద్వైతశూన్యమా
భావము మైరహింగసఁగ బ్రహ్మకు నావృతిఁ దెల్పద్వైతసం
భావనగల్గునద్వయము భంగమునొందు శ్రుతుల్విరుద్ధమా.

క. రవియందుఁగంటిఁ బొదవెడు
భువనదమును దలఁచునట్లు బుద్ధిగుణములా
భవమోక్షములను బ్రహ్మము
నవమతిఁ గల్పించు నద్వయానంగునిలన్ 573

క. పరమాత్మబంధ ముండుట
మఱిలేదనుటయును రెండుమానసగుణముల్
నిరతముఁ బరిపూర్ణుండగు
పరమాత్మకు రెండులేవు పరతత్త్వజ్ఞా! 574

చ. పయివివరించువాక్యముల బంధము మోక్షముమాయఁ బుట్టుని
ష్క్రియమున నిష్కలమ్ముఁదగఁ గేవలశాంతముదోషశూన్య
మద్వయమునిరంజనమ్మునగు బ్రహ్మమునర్ గగనంబువోలెని
శ్చయముగ బంధమోక్షములుసర్వవిధమ్ములలేకయుండెడున్.

— పరమాత్మస్వయంజ్యోతి —

ఆ. చావుపుట్టలేదు సంసారమునులేదు
సాధకుఁడు ము ముముక్షుజనుఁడుఁగాడు
ముక్తుఁడొనరఁగాడుమునిశీల! పరమార్థ
మిదిరహస్యమనుచు నెఱుఁగుమీవు. 576

—♦ అధికారివగుటఁ దెల్పితి ♦—

చ. అపగత దోషచిత్తుఁడవ కానివినై యపవర్గమెంచు నీ
కృపనిలఁ బుత్త్రుఁగాఁ దలఁచి కేవల సత్త్వవిధిప్రసిద్ధమా
నుపనిషదర్థనిర్ణయము నుత్తమమీపరమార్థమేను నీ
కిపుడెఱుఁగంగఁ దెల్పితి ననేకవిధంబుల శిష్యసత్తమా! 577

—♦ గుర్వాజ్ఞను శిష్యుఁ డేగుట ♦—

క. పరమకృప నిట్లు దెల్పిన
గురువచనము విని ముదమ్ముఁ గొని వినయమునన్
శిరమొనరవంచి నతులిడి
గురునానతి శిష్యుఁ డేగెఁ గుతుకము తోడన్. 578

—♦ పరిపూర్ణగురునిష్క్రమణము ♦—

క. పరమానంద పయోధిని
నెరిమగ్నస్వాంతుఁడగుచు నిర్భిన్నుండై
ధర నెల్లఁ దనుపఁ జేయుచు
గురువర్యుఁడుఁ గూడ స్వేచ్ఛగూరంబాఱెన్. 579

—♦ ముముక్షుజ్ఞానార్థ పరతత్త్వబోధ ప్రశ్నోత్తరపూర్వకము ♦—

క. ధర మోక్ష మెంచువారికి
నిరతము సుఖబోధగలుగ నిటు తెల్పఁబడెన్
గురుశిష్య ప్రశ్నోత్తర
పరిభాషను నాత్మతత్త్వపద్ధతి మిగులన్. 580

—♦ ముముక్ష్వాదరణీయము ♦—

చ. భవసుఖశూన్యులై శమవిభక్తనిరస్త సమస్త దోషులై
ప్రవిమలశాంతచిత్తులయి భవ్యముగన్నిగమాంత సారముం

జవిగని ముక్తినెంచుయతి సత్తములీహితమౌ గురూక్తిని
భువినతికూర్మిమైనలరి పొందుగ నిత్యము నాదరించుతన్ -

—♦ వివేకచూడామణి నిత్యశాంతి ప్రశంసము ♦—

సీ. పరమనిర్వాణ సౌభాగ్యసంపదఁగూర్చు
శ్రీశంకరాచార్య హితవచనము
సంసారమను భయ జనకమార్గమునందుఁ
దాపత్రయంబను తపనరుచిని
వరలుదాహవ్యథా భరమునఖిన్నులై
భ్రమనొందిజలకాంక్షఁ బడిమగుభువి
సంచరించుచునుండు జనములకలరంగ
నిరతసౌఖ్యమ్మును గరపునట్టి
గీ. యద్వయంబగు పరమాత్మయనఁగఁ జెలఁగు
నతిసమీపానఁ దనలోన నలరునమృత
జలధిదాహముఁ బోకార్చి శాంతిసౌఖ్య
మొసఁగి యాచంద్రతారమై యుండుఁగాక ! 582

ఇది శ్రీ, శ్రీరామచంద్ర కరుణారస సంప్రాప్త, సరసకవితా
విచిత్ర, సువర్ణఫలగోత్ర పవిత్ర, మొటపర్తి వంశజలనిధి
పూర్ణకుముదమిత్ర, సీతమాంబా సుబ్బయాహ్వాయ
ద్వితీయపుత్ర సుజనవిధేయ సోమయ్యా నామధేయ
విరచితంబగు నాంధ్రవివేకచూడామణి యను
వేదాంత గ్రంథరాజము సంపూర్ణము.

శ్రీ పరబ్రహ్మార్పణమస్తు.

ఓం తత్సత్.

శ్రీ. శ్రీ. శ్రీ.

# తప్పొప్పుల పట్టిక.

| పేజి నెం. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 21 | జన్మము | జన్నము |
| 7 | 14 | మోాక్షాభివృద్ది | ముముక్షుతాభివృద్ధి |
| 17 | 21 | విషయముల | విషమ్ముల |
| 42 | 19 | వృత్తులు | వృత్తుల |
| 44 | 19 | నఃపాధ | నఃపాధి |
| 49 | 9 | కోశముల సత్యత | కోశము లసత్యత |
| 50 | 13 | సాసా | సాక్షి |
| 56 | 5 | వీరీతి | ఏరీతి |
| 64 | 14 | మంచిగంధము | మంచిగందము |
| 85 | 18 | దమమరి | దమమది |
| 95 | 9 | కూడలి | కుండలి |
| 97 | 19 | శుద్ద | శుద్ధ |

135

# మావద్ద వెలకు దొరకు గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | ఆంధ్రవివేక చూడామణి | వెల రు 1—0—0 |
| 2. | కుచేల - హరికథ ... ... | 0—8—0 |
| 3. | నీళాసుందరీ పరిణయము - నాటకము | 0—8—0 |
| 4. | సంస్కృత భాషా ప్రబోధము ... | 0—2—0 |
| 5. | ఆంధ్ర ప్రశ్నోత్తరరత్నమాల ... | 0—2—0 |
| 6. | ఆంధ్రమేఘదూత - (అచ్చులోనున్నది) | |
| 7. | మొటపర్తి వెంకటనారాయణగారి జీవితము ... | (ఉచితము) |
| 8. | పుణ్యసతీ చరిత్ర ... | ,, |

వలయువారు:—

గ్రంథకర్త:

మొటపర్తి చిన సోమయ్య చౌదరి,

దెందులూరు, ఏలూరు తాలూకా.

అనివార్యావలెను.

Printed at the Rama Power Press, Ellore. C. 1000–1-2-33

136



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA127B141 |
| పుస్తకం పేరు | ఆంధ్రవివేకచూడామణి |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 167 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, , BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |